రెండవయడ్డవీథినున్న ౨ వది, ౩ వది, ౫ వది, ౯ వది ఒంటిలఘువృత్తములు. మూఁడవచాలున నున్న ౪ వది, ౭ వది, ౧౩ వది, ౬ వది,౧౧ వది, ౧౦ వదియు రెండేసిలఘువులవి. నాలుగవబంతి నున్న ౮ వది, ౧౫ వది, ౧౪ వది, ౧౨ వది, మూఁడేసిలఘువుల వృత్తములు. కడపటి ౧౬ వది యొక్కటియు నాలుగులఘువుల సర్వలఘువృత్తము. 167

## పద్యలక్ష్యోపయోగిసంజ్ఞలు.

ఉక్తాఛందం బొక్కయక్షరంబుననుండి యొండొంటికివచ్చునక్షరంబు షడ్వింశాక్షరపర్యంతంబుగా జరుగు నందు నుక్తకుఁ బ్రతిపాద మేకాక్షరం బౌను.168

| ఛందస్సంఖ్యలు. | వృత్తసంఖ్యలు. | ఛందస్సంఖ్యలు. | వృత్తసంఖ్యలు. |
|---|---|---|---|
| ౧ శ్రీవృత్తము | ౧ | ౭ లోల | ౨౪ |
| ౨ స్త్రీవృత్తము | ౨ | హంసమాల | ౨౫ |
| ౩ నారీవృత్తము | ౩ | మదరేఖ | ౨౬ |
| మృగి | ౪ | కుమారలలిత | ౨౭ |
| వినయ | ౫ | సరసిజము | ౨౮ |
| ౪ కన్య | ౬ | విభూతి | ౨౯ |
| వ్రీడ | ౭ | మధుమతి | ౩౦ |
| సుకాంతి | ౮ | మదనవిలసిత | ౩౧ |
| బింబము | ౯ | ౮ విద్యున్మాల | ౩౨ |
| ౫ ప్రీతి | ౧౦ | వితానము | ౩౩ |
| త్రగుణ | ౧౧ | విమానము | ౩౪ |
| సతి | ౧౨ | సింహరేఖ | ౩౫ |
| పఙ్క్తి (సుందరి) | ౧౩ | చిత్రపదము | ౩౬ |
| నంద | ౧౪ | హంసరుతము | ౩౭ |
| అంబుజ | ౧౫ | నారాచము | ౩౮ |
| ౬ సావిత్రి | ౧౬ | ప్రమాణి | ౩౯ |
| విచిత్ర | ౧౭ | నాగరము | ౪౦ |
| తనుమధ్య | ౧౮ | మాణవకము | ౪౧ |
| చంద్రవదన | ౧౯ | సమాని | ౪౨ |
| శశివదన | ౨౦ | ౯ భుజంగశిశురతము | ౪౩ |
| స్ఫురలత | ౨౧ | ఉత్సుకము | ౪౪ |
| వసుధ | ౨౨ | భద్రకము | ౪౫ |
| వసుమతి | ౨౩ | హాలముఖి | ౪౬ |
| | | ౧౦ పణవము | ౪౭ |

క. యతిగణనామస్తోత్రము, వితతంబుగ సలిపి గురుల వినుతించి తగన్
యతిగణనామయుతంబుగఁ, బతగధ్వజ తేటపఱుతుఁ బద్యవిధంబుల్. 169

క. సమవిషమవృత్తమణులకు, సమాద్రము లనంగఁ దనరి షడ్వింశతిభే
దము లై వేదములకుఁ బాదములై ఛందంబు లొప్పిదము లగు వరుసన్. 170

తే. జగతి సమవృత్త మెన్నవఛందమునను
సంభవము నొందు నన్నియక్షరము లమరుఁ
బదపదమునకు హెచ్చును గొదువ లేక
గణములను సౌఖ్యభంగిని గానఁబడును. 171

ఆ. ఒంటికాలఁ గొంద ఱుండఁ జేసిరి పాద, యుగముతోడ గొంద ఱుండఁ జేసి
రేను సకలవృత్తవృషముల నడిపింతు, నాల్గుపాదముల ఘనంబు నొగడ. 172

క. ఒకకాలను రెండడుగులఁ, బ్రకటంబుగ గ్రంథవిస్తరభయంబునఁ బూ
ర్వకవులవలెఁ జెప్పిన తే,ఖకుఁ డొకలిపి విడువఁ దప్పఁ గనఁ దర మగునే. 173

క. నేను రచించినవృత్తవి,తానములో నొకట రెంటఁ దప్పుండిన వి
ద్యానిధులు కడమపదముల,లో నారసి యతులు గణములును దెలియఁ దగున్. 174

తే. అడుగులకు వర్ణములు గొంచె మగుటఁ జేసి
యందు నుక్తాప్రభృతినవచ్ఛందములను
బాదము వృత్తములకు సెల్లవడులు లేవు
నాల్గుపదములఁ బ్రాసము ల్నడచుఁ గాని. 175

క. గురులఘుగణసంజ్ఞలయ,క్షరములు దీర్ఘంబు లైనఁ జను నవి రెండై
పగుపడి సంయుక్తము లై, పరఁగిన నవి రెండు నెన్నఁబడు నెంబడి గాన్. 176

౯. ప్రథమచ్ఛందం బగునుక్తయందుఁ బ్రతిపాదంబునకు నొక్కొక్క యక్షరం బై రెండువృత్తంబులు వుట్టె నందు శ్రీ యనువృత్తము.

శ్రీవృత్తము. ౧-౧

U గ.

శ్రీ
గో
పా
లా

ద్వితీయచ్ఛందంబగు నత్యుక్తయందుఁ బ్రతి పాదంబునకు రెండేసి యక్షరంబు లై నాల్గు వృత్తంబులు వుట్టె నందు:—

స్త్రీవృత్తము. ౨-౧

UU గగము.

స్త్రీనా
గాది
ష్టానిం
ఘూనున్.

తృతీయచ్ఛందం బగుమధ్యయందుఁ బ్రతి పాదంబునకు మూఁడేసియక్షరంబు లై యెనిమిది వృత్తంబులు వుట్టె నందు:—

నారీ. ౩-౧

UUU మగణము.

శ్రీనాథున్
నే నెంతున్
మానొప్పం
గా నాదిన్.

మృగీ. ౩-౩

U I U రగణము.

భూమిలో
రా మహో
ద్దామ మాఁ
దా మృగిన్.

అందు వినయవృత్తము. ౩-౪

I I U సగణము.

వినయం
బనఁగాఁ
జను సా
వనఘా.

చతుర్థచ్ఛందం బగుప్రతిష్ఠయందుఁ బ్రతి పాదంబునకు నాలుగేసియక్షరంబు లై ౧౬ వృత్తంబులు వుట్టె నందు:—

కన్యా. ౪-౧

UUUU మగ.

భావింప స్వా
గావాప్తి న్న
న్యావృత్తంబీ
కేవన్పొల్చున్.

వ్రీడ. ౪-౨

I UU య U గ.

యగల్ చెప్పం
దగు వ్రీడన్
నగోద్ధర్తా
జగద్భర్తా.

సుకాంతి. ౪-౬

I U I జ U గ.

జకారమున్
గకారమున్
సుకాంతికిన్
శుకస్తుతా.

బింబ. ౪-౭

U I I భ U గ.

ఇమ్మహిలోఁ
గ్రమ్మ భగల్
బింబమూనం
గంబుధరా.

పంచమచ్ఛందం బగుసుప్రతిష్ఠయందుఁబ్ర
తిపాదంబునకు నైదేసియక్షరంబుల ము
ప్పదిరెండువృత్తంబులు పుట్టె నందు:-

ప్రీతి. ౫-౩

∪ । ∪ ర ∪∪ గగ.

ప్రీతికి న్రైఫా
స్వాతగద్వంద్వం
బై తగుఁ దైత్యా
రాతివర్ణింపన్.

ప్రగుణ. ౫-౪

।। ∪ స ∪∪ గగ.

ప్రగుణాఖ్యం బొ
ప్పగుఁ జెప్పంగా
సగగాస క్తిన్
నిగమస్తుత్యా.

సతి. ౫-౬

।∪।∪∪ గగము.

క్షితిం జగాసం
గతిం దనర్చున్
సతీసువృత్తం
బతిప్రసిద్ధా.

పఙ్క్తి (సుందరి). ౫-౭

∪।।భ∪∪ గగము.

ఏకభకారం
బేకగగంబున్
గైకొనుఁ బఙ్క్తిన్
శ్రీకమలాక్షా.

నంద. ౫-౧౩

∪∪ । త । ∪ వగణము.

దేవస్తుత నం
దాప్తవృత్తమునన్
శేవ న్నిలుపం
గా వచ్చుఁ దనల్.

అంబుజము. ౫-౧౫

∪।। భ। ∪లగము.

ఇక్షుల భకా
రమ్ము లగయు
క్తిం బరఁగుఁ దా
నంబుజమనన్.

వ. షష్ఠచ్ఛందం బగుగాయత్రి యందుఁబ్ర
తిపాదంబునకు నాఱేసియక్షరంబు లై
యఱువదినాల్గువృత్తంబులు పుట్టెనందు:

సావిత్రి. ౬-౧

∪∪∪ మ ∪∪∪ మ.

గోవిందస్తోత్రంబుల్
దైవారు న్స్వామిక్తిన్
సావిత్రీవృత్తంబుల్
గావింపంగా నొప్పున్.

విచిత్ర. ౬-౧౦.

। ∪∪ య । ∪∪ య.

తనర్చు న్విచిత్రం
బనంగా యయాప్తిన్
ఘనశ్యామగాత్రా
మునిస్తోత్రపాత్రా.

తనుమధ్య. ౬-౧౩

∪∪ । త । ∪∪ యగణము.

కామేపలివాసున్
మే మెంతు మనంగన్
స్వామీ తనుమధ్యన్
భూమిన్ దయ లొప్పన్.

చంద్రవదన. ౬-౧౫

∪ ।। భ । ∪∪ య.

చంద్రవదనన్ దే
వేంద్రవినుతా ని
స్తంద్ర తభయంబుల్
సాంద్రముగఁ జెప్పన్.

శశివదన. ౬–౧౨

| | | న | U U య.

శశివదనాఖ్యన్
విశదము లయ్యెన్
దిశల నయంబుల్
దశముఖవైరీ.

*సురలత. ౬–౧౨

| | | న | U U య.

మురహరుఁ దేవే
కురుకుచ నాఁగా
ధరణి నయంబుల్
సురలత కొప్పన్.

అందు వసుధావృత్తము

వసుధ. ౬–౧౫

| | U స | | U స.

వసుదేవసుతున్
బొసఁగింపు మనన్
వసుధాహ్వయ మిం
పెసఁగున్ ససలన్.

వసుమతి. ౬–౧౯

U U | త | | U స.

బృందావనవిహా
రిం దర్శించెద నం
చందు న్వసుమతిం
బొందింతురు తసల్

వ. సప్తమచ్ఛందం బగునుష్ణిక్ఛందంబునం బ్రతిపాదంబునకు నేడేసియక్షరంబులై నూట యిరువది యెనిమిది వృత్తములు పుట్టె నందు:—

లోల. ౭–౧౦

| U U య | U U య U గ.

ధరిత్రీసుతారాతిన్
సరోజాతపత్త్రాక్షున్
హరిన్ యాగలన్ లోలన్
గరం బొప్ప వర్ణింతున్.

హంసమాల. ౭–౨౦

| | U స U | U ర U గ.

సరగంబుల్ రచింపన్
బరఁగున్ హంసమాలా
నరసింహావతారా
సురవిద్విడ్విదారా.

మదరేఖ ౮–౨౯

U U U మ | | U స U గ.

గోపాలాఖ్యుఁడు నిచ్చల్, మాపాలం గలఁ డంచున్
రూపింప న్మసగంబుల్, దీపించు న్మదరేఖన్.

కుమారలలిత ౮–౩౦

| U | జ | | U స U గ.

సుమేరుధనిభాంగా, రమాహృదయనాథా
కుమారలలితావృత్త మొప్పు జసగా ప్తిన్.

* 'సురలత' కును, 'శశివదన'కును భేదము లేదు. కాఁబట్టి లక్షణమును మరలఁ జూప ననవసరము.

సరసిజము ౭-౩౧

౹ భ ౹ స ౹ గ.

కోరి సరసిజం బిం, పారు భసగయుక్తిఁ
శారదనుతిపాత్రా, నీరదనిభగాత్రా.

విభూతి ౭-౪౩

౹ ర ౹ జ ౹ గ.

ఇమ్మహిన్ రజంబులం, తమ్ముసం గకారముల్
గ్రమ్మియుండునట్టివృ, త్తమ్ము దా విభూతి యా.

మధుమతి ౭-౫౬

౹౹౹ న ౹౹ భ గ.

కుధరవైరిశరుల్, విధుఁడు దా నమరుల్
మధుమతి న్నవము, న్మథశరీర హరీ.

మదనవిలసితము ౭-౬౪

౹౹౹ న ౹౹౹ గ.

పదపడి ననగల్, గదసి వెలసినన్
మదనవిలసితం, బది యదుతిలకా.

వ. అష్టమచ్ఛందం బగునసుష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకు నెనిమిదేసి యక్షరంబు లై యున్నాటరయేఁబదాఱు వృత్తంబులు పుట్టె నందు.

విద్యున్మాల ౮-౧

మ మ గగము.

శ్రీదేవీధాత్రీప్రాణేశా, యాదిత్యజ్యోతిస్తుత్యా
వేదోద్ధర్తా విద్యున్మాలం, బా దైమా గాప్రాప్తిం బొల్పున్.

వితాన ౮-౬

౹ జ మ గగము.

క్షితిన్ జగాయుక్తం బైనన్, వితానవృత్తం బై యొప్పున్
పితామహాద్యాదిత్యప్రస్తుతప్రభావా సర్వేశా.

విమానము ౮-౩౮

౹ జ ౹ త గగము.

క్షమన్ జతాంతస్థగాయు, క్తమై రచింపం బొసంగున్
విమాన మంభోరుహాక్షా, రమాంగనావాసవక్షా.

### సింహరేఖ ౨-౪౩

U I U ర I U I జ U U గగము.

ద్వారకాపురీవిహారా, మేరుధీర పంచబాణా
కార సింహరేఖకుం బెం, పార రేఫజల్ గగంబుల్.

### చిత్రపదము ౨-౬౬

U I I భ U I I భ U U గగము.

చిత్రపదం బనువృత్తం, బత్రిమునిస్తుతు శౌరిన్
స్తోత్రము సేయఁగ నొప్పున్, ధాత్రిని భాగగయుక్తిన్.

### హంసరుతము ౨-౬౭

U U U మ I I I న U U గగము.

శ్రీవత్సాంకితసువక్షా, దేవా హంసరుత మొందున్
భావింప న్మనగగా ప్తిన్, గావింపం దగు ధరిత్రిన్.

### నారాచము ౨-౨౬

U U I త U I U ర I U వగణము.

క్షీరాబ్ధికన్యకాపతిన్, నారాయణుం ద్రవంబులన్
దోరంబుగా నుతించినన్, నారాచవృత్త మై చనున్.

### † ప్రమాణి ౨-౨౮

I U I జ U I U ర I U వగణము.

అమిత్రలోకసంహరా, సమగ్రకాంతి భాసురా
క్షమన్ జరేభగంబులన్, ప్రమాణివృత్త మొప్పగన్.

### నాగరము ౨-౨౭

U I I భ U I U ర I U వగణము.

బాగమరన్ భరేఫసం, యోగలగంబుల న్మహా
యోగినుతు న్వినంబడున్, నాగరనామవృత్త మై.

### మాణవకము ౨-౧౦౩

U I I భ U U I త I U వగణము.

శోణమయూఖప్రవిభా, బాణసుపర్వారిహరా
వేణుధరా భత్వములన్, మాణవకం బై తనరున్.

---

†ఇది (పూ. ము.) లో లేదు. దీనిపేరుమాత్రము సంజ్ఞలపట్టీలోనున్నది (చూ. ౨. ౩౮.).

సమాని ౮-౧౦౭

U I U ర I U I జ I U వగణము.

శారదాదిమానివరుల్, చేరి శౌరిఁ గొల్తు రవ్ల
గోరి రేఫమును జవముల్, ధారుణి న్సమాని నగుఁ.

వ. నవమచ్ఛందం బగుబృహతియందుఁ బ్రతిపాదంబునకుఁ దొమ్మిదేసియక్షరంబు లై యేనూటపండ్రెండు వృత్తంబులు పుట్టె నందు:—

* భుజంగశిశురుతము ౮-౧ ౧౨

I I I న I I I న I U U యగణము.

నిజమున ననయ లొప్పఁ, భుజగశిశురుత మయ్యెఁ
సుజనవినుతచరిత్రా, వృజినతృణఘనదాత్రా.

ఉత్సుకము ౯-౧౮౩

U ॥ భ U ॥ భ U I U రగణము.

వాసవముఖ్యసురస్తుతా, దాసమనోంబుజషట్పదా
వాసిగ భారము లొందినఁ, భాసిలు నుత్సుకవృత్తముల్.

భద్రకము ౯-౧౮౭

U I U ర I I I న U I U రగణము.

శాద్రవేయశయనా సమా, న్నిద్రదైత్యమదభంజనా
రుద్రమిత్ర రనరేఫముల్, భద్రకంబునకు భాసిలుఁ.

హాలముఖి ౯-౨౪౧

U I U ర I I I న I I U సగణము.

కింకరీకృతసురవరా, పంకజాతదళనయనా
పొంక మౌ రనసగణముల్, శంక లేక హాలముఖికిఁ.

ఆ. పఙ్క్తినుంచి వృత్తపఙ్క్తి కిన్నవ్రాయి, వడి యటంచుఁ జెప్పఁబడియె నిచట
సంస్కృతంబునందుఁ జనుఁ బదవిచ్ఛేద, మడుగు మొదలివర్ణ మగుఁ జెనుఁగున. 177

క. ధర గణితశాస్త్రసంజ్ఞల, శరరసగిరిదంతినిధిదిశాశంకరభా
స్కరవిశ్వమనుదినోర్వీ, శ్వరనామములు యతివర్ణసంఖ్యార్థంబుల్. 178

వ. దశమచ్ఛందం బగుపఙ్క్తియందుఁ బ్రతిపాదంబునకుఁ బదేసియక్షరంబు లై వేయు నిరువదినాల్గువృత్తములు పుట్టె నందు:—

*సంజ్ఞలపట్టీలో 'భుజంగశిశు' అనియేయున్నది; గాని ఇచ్చట (పూ. ము)లో 'భుజంగశశి' అని తప్పుగనున్నది.

పణవము ౧౦-౧-౨౧

∪∪∪ మ | | | న | ∪∪ య ∪ గ.

ఉర్విన్ మ్నయగ • యుతపాదంబుల్, పర్వ న్మధ్యతిఁ • బణవం బయ్యెన్
గీర్వాణాహిత•గిరినాకేశా, సర్వేశా రవి•శతసంకాశా.

మయూరసారి (మయూరభాషిణి) ౧౦-౧౭౧

∪ | ∪ ర | ∪ | జ ∪ | ∪ ర ∪ గ.

వెక్కసించె శైల • విక్రమంబు, ల్పొక్కి రేఫజంబు•లు న్రగంబుల్
చక్కఁగా మయూర•సారి కొప్పన్, నిక్క మంబుజాత•నేత్ర శౌరీ.

రసాలి ౧౦-౧౮౭

∪ | ∪ ర | | | న ∪ | ∪ ర ∪ గ.

గోత్రవిక్రమము • గూడి భక్తిన్, ధాత్రి రేఫనగ•ణంబు లొప్పైఁ
బోత్రిరూప రగ•ము ల్రసాలం, జిత్రభంగి నుతి•సేయు నిన్నున్.

రుగ్మవతి ౧౦-౧౯౯

∪ || భ ∪∪∪ మ || ∪ స ∪ గ.

అంగయతిం బొం•దై భమస ల్పూర్వం గురుయుక్తి • న్రుగ్మవతి న్స
త్యాంగనకై తేఁ•డా సురశాఖిం, బొంగుచు గోపీ•పుత్త్రుఁ డనంగన్.

*చంపకమాలి ౧౦-౧౯౯

∪ | భ ∪ ∪ ∪ మ | | ∪ స ∪ గ.

భూమిధరక్రాంతు • ల్పొలుపారన్, బ్రేమ భమంబు ల్గో•రి సగంబుల్
దాము నుతించు న్నం•దసుతు న్భా, మామకరాంకుం జం•పకమాలిన్.

మణిరంగము ౧౦-౨౮౧

∪ | ∪ ర || ∪ స || ∪ స ∪ గ.

అంగనామణు • లంగయతుల్గా, సంగ పెంచ్చ ర•సాగురుయుక్తిన్
బొంగుచు న్యదు•పుంగవు వేడన్, రం గగున్ మణి•రంగ మనంగాన్.

మత్త (హంసశ్రేణి) ౧౦-౨౮౧

∪∪∪ మ ∪ || భ || ∪ స ∪ గ.

శైలక్రాంతి న్మభ•సగ లోలిం, గ్రాల న్మత్తాఖ్యను • గనుపట్టున్
బాలించె న్యాదవ•పతి యాపాం, చాలిం గౌరవ్యుల•సభ నాఁగన్.

---

*రుగ్మవతికిని, చంపకమాలికిని గణములలో భేదములేదు; యతిస్థానమువమాత్రము భేదముగలదు గాన వేఱుగఁజెప్పఁబడినది.

కౌముది ౧౦-౭౯౬

। । । న ◡◡ । త ◡◡ । త ◡ x.

మునినుతా కౌ•ముదీవృత్త మెు, వ్వను నతాగం•బులన్ షడ్యతిన్
దునిమెం చాల•స్య్ర భూపుత్రి కై, కినుక రామ•క్షితీశుం డనన్.

భోగివిలసితము (విలసితము) ౧౦-౬౫౧

◡ ॥ భ ॥ ◡ స । ◡ । జ ◡ x.

సాగభసములున్ • జగంబులున్, జా గగు నగవి•శ్రమంబులన్
భోగివిలసితం•బుం జెప్పఁగా, సాగరతనయా•సమన్వితా.

మనోరమ ౧౦-౩౮౮

। । । న ◡ । ◡ ర । ◡ । జ ◡ x.

నరజగంబుల • న్మనోరమల్, సరవి శైలవి•శ్రమంబులన్
దురితదూరు విం•ధుజాపతిన్, సారిది సన్నుతిం•చు నెంతయున్.

*శుద్ధవిరాటి ౧౦-౩౮౫

◡◡◡ మ । । ◡ స । ◡ । జ ◡ x.

చా లొప్ప న్మసజ ల్గకారమున్, గ్రాలు న్శుద్ధవి•రాటిన్ షడ్యతిన్
నీలాంగా రమ•ణీమనోభవా, నాళీకాసన•నందనస్తుతా.

నందిని ౧౦-౩౯౬

◡ । । భ ◡◡ । త । ◡ । జ ◡ x.

శ్రీరమణా ని•ర్జితదానవా, సారసపత్రే•క్షణ షడ్యతిన్
సారె భతంబు•ల్జగము ల్దగన్, ధీరులచే నం•దిని నాఁ జనున్.

పఙ్క్తి ౧౦-౪౩౯

◡ । । భ ◡ । । భ ◡ । । భ ◡ x.

గ్రావవిరామము•గా విబుధుల్, భావజుతండ్రిని•భాభగురుల్
గా వినుతించిన•గావ్యముల, న్నావిరిఁ బఙ్క్తియ•నం బరఁగున్.

వ. ఏకాదశచ్ఛందం బగుత్రిష్టుప్పునందుఁ బ్రతిపాదంబునకుం బదునొకం డేసియక్షరంబు లై ౨౦౪౮ వృత్తంబులు వుట్టె నందు:—

* (పూ. ము.) సంజ్ఞలపట్టీలో 'వరాటి' అనియున్నది; (పె)లో విరాటి; విరాట (ప).

### ఇంద్రవజ్ర ౧౧-౩౫౭

UU । త UU । త । U । జ UU గగము.

ఇంతు ల్పదా పాదము•లింద్రవజ్రల్, స్వాంతంబున న్మోహము•సంధిలంగఁ
దంతావళక్రాంతిని•తా జకార,ప్రాంతంబునం గద్వయ•మంద మందన్.

### ఉపేంద్రవజ్ర ౧౧-౩౫౮

। U । జ UU । త । U । జ UU గగము.

త్రపాచరాచ ల్జతి•జ ల్గగంబుఁ, బ్రపూర్ణ మై దంతివి•రామ మొప్పఁ
ద్విపాధిపత్రాత ను•తింపఁ జేరై, యుపేంద్రవజ్ర ల్వెల•యు న్ధరిత్రిన్.

### ఉపస్థితము ౧౧-౩౬౯

UU । త । U । జ । U । జ UU గగము.

భక్తు ల్హరిమీఁద ను•పస్థితం బా, స క్తి న్విరతు ల్కరి•సంఖ్య సాగఁ
సూక్తు ల్గాని చెప్పెదు•చోఁ దజాగా,యు క్తం బగుచుం జెలు•వొందుచుండున్.

### దోదకము ౧౧-౪౩౯

U । । భ U । । భ U । । భ UU గగము.

తోరప్రవేదుక • [1]దోదక మొప్పఁ, భూరివిరామము • భూధరసంజ్ఞం
బారుచు భాభగ•గాన్విత మై ల,క్ష్మీరమణా విర•చింప నెసంగున్.

### రథోద్ధతము (పరాంతిక) ౧౧-౬౯౯

U । U ర । । । న U । U ర । U వగము.

అంది రేఫనర•వా ప్తి నొప్ప గో,వింద భూమిధర•విక్రమంబులఁ
జెంది కబ్బములఁ • జిత్రభంగిఁ జె,న్నొందు నెంతయు ర•థోద్ధతం బిలన్.

### భద్రకము ౧౧-౭౦౪

। । । న । । । న U । U ర । U వగము.

నరకదమన • నారవంబులఁ, సరగఁ గుధర•సమ్మితంబు లై
విరతు లమర • వేడ్కఁ జెప్పినం, బరఁగుఁ గృతుల•భద్రకం బనన్.[2]

### స్వాగతము ౧౧-౪౪౩

। U ర । । । న U ।। భ UU గగము.

స్వాగతంబు దగు • శైలవిరామం, బై గజేంద్రవర•దా రనభంబుల్
పై గురుద్వయము • భాసిలఁ జెప్పన్, యోగిమానసప•యోజమిలిందా.

---

1 తోటక (పె. ప). 2 చూ. చంద్రిక.

కాంతి ౧౧-౮౭౭

UU I త I U I జ I U I జ I U లగము.

క్రాంతు ల్కరిసంఖ్యను ♦ రాజిలఁగా, సంతోషముతోడఁ ద♦జాలగముల్
చింతింపఁ బదంబులఁ ♦ జెంద రమా, కాంతావ్యాదయేశ్వర ♦ కాంతి యగున్.

శ్యేని ౧౧-౬౮౩

U I U ర I U I జ U I U ర I U వగణము.

మానితా క్రివిక్ర♦మంబుఁ బూనఁగా, శ్యేనికి న్రజ ల్వ♦యి న్రవంబులుఁ
గాని యొండు గూర్పఁ ♦ గాదు రుక్మిణీ, ప్రాణనాథ కామె♦పల్లిమందిరా.

వాతోర్మి ౧౧-౮౧౭

UUU మ U I I భ UU I త I U వగణము.

ఆమోదం బొప్పఁగ ♦ వ్యాసాదికవుల్, భూమిధ్ర శ్రాంతులు ♦ పొంగార మహీ
భామాప్రాణేశ మ♦భంబుల్ తవలుఁ, దా మీవాతోర్మిని ♦ దాపింతు రొగిన్.

కలితాంతము (గీతాలంబనము) ౧౧-౮౭౭

U U I త I U I జ I U I జ I U లగము.

సామోద్భవవిక్రమ♦సంయుత మై, వేమాఱు తజాలగ♦విస్తృత మై
దామోదరదేవుక♦థ ల్పలుకఁ, భూమిం గలితాంతము♦పూర్ణ మగున్.

శాలిని ౧౧-౩౮౯

U U U మ U U I త U U I త U U గగము.

ధీరశ్రేష్ఠు ల్సన్ను♦తింపరి గవీంద్రా♦ధారం బై ధాత్రి న్మ♦తా గాగణా ప్తిఁ
దోరం బై భూభృద్య♦తుల్ సంఘటింపఁ, నీరేజాక్షా శాలి♦నివృత్త మొప్పున్.

సుముఖి ౧౧-౮౮౦

I I I న I U I జ I U I జ I U లగము.

ఖగపతివాహ ♦ కపర్దినుతా, మృగపతిమధ్య ♦ హితార్తిహరా
నగవిరమం బె♦నయంగ నజా, లగములచేఁ జె♦లఁగు న్సుముఖుల్.

భ్రమరవిలసితము ౧౧-౧౦౦౯

U U U మ U I I భ I I I న I U వగణము.

ఏయంఘ్రిం బార♦యి మగణభన, ల్వా యొక్కం డవ్వ♦లను సెలకొనఁ
మాయాతీతా భ్ర♦మరవిలసితం, బై యొప్పం దగ్గ♦యుతుల నిలుచున్.

### వృత్త ౧౧-౨౮౮

I I I న I I U స U U I త U U గగము.

అనయమును వే♦దాంగంబు సెప్పఁగ, దనుజహర న♦స్తంబు ల్గగంబుగ
బెనఁగొని ధరా♦భృద్విశ్రమంబుల్, దనరుననది వృ♦త్తావృత్త మంచున్.

### పృథ్వి ౧౧-౮౯౬

I I I న I I I న I U I జ I U వగము.

నలినభవనుత♦నాజలగం, బులు గలయతులఁ ♦ బొందుపడం
బెలుచఁ బలికినఁ ♦ బృథ్వి యనఁగ, వెలయు నౌకసము♦వృత్త మిలన్.

### వృంత ౧౧-౨౫౬

I I I న I I I న I I U స U U గగము.

నగణయుగము సగ♦ణం బొందుగ, గగ మొకటియు జత♦గాఁ గూడఁగ
ఖగవిరమములను ♦ గల్పింపఁగ, దగుఁ గవులకు వసు♦ధ న్వృంతల్.

### మౌక్తికమాల ౧౧-౪౮౭

U I I భ U U I త I I I న U U గగము.

భక్తజనత్రాత ♦ భతనగాసం, యుక్తము లై మాని♦యుతయతుల్ సు
వ్యక్తము లై సూక్తు♦లమరఁ జెప్పఁగ, మౌక్తికమాలాక్ర♦మము లెసంగున్.

### ఉపస్థితము (శిఖండివిరుతము); (స్త్రీ) ౧౧-౨౮౬

I U I జ I I U స U U I త U U గగము.

ఉపస్థితమునం ♦ దొప్పారుచుండుఁగ, దపస్వివిరతు ♦ ల్దాకం జకారం
బుపై సతగణం♦బు ల్గద్వయంబుఁగ, గపిధ్వజసఖా ♦ కామేపలీశా.

### ఏకరూప ౧౧-౩౬౯

U U U మ U I I భ I U I జ U U గగము.

ఏపారుం గావ్యముల ♦ నేకరూపల్, త్వాపుత్రీశుఁగ సుభజ♦గాగణంబుల్
బ్రాపించుం గుంజరవి♦రామ మొప్పఁగ, బాపంబుల్ వాయుటకుఁ♦బ్రస్తుతింపన్.

### చంద్రిక ౧౧-౭౦౪

I I I న I I I న U I U ర I U వగము.

అగవరధర వార♦వాన్వితం, బుగఁ గృతులను జెప్పఁ ♦ బొందికై
తగ నిధివిగమంబు ♦ గాఁకఁగా, జగతిని నెగ డొందుఁ ♦ జంద్రికల్.

వ. ద్వాదశచ్ఛందం బగుజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బండ్రెండేసియక్షరంబులై ౪౦౯౬ వృత్తంబులు పుట్టె నందు.

స్రగ్విణి ౧౨-౧౧౭౧

U I U ర U I U ర U I U ర U I U ర.

కామెపల్లీమహా♦గ్రామమధ్యంబునన్
భూమిదేవోత్తము ♦ ల్పూజ సేయంగ నా
స్వామియున్నాఁడనన్ ♦ స్రగ్విణిన్ శైలవి
క్రమయుక్తిం జతు♦ష్కంబగున్ రేఫముల్.

భుజంగప్రయాతము ౧౨-౫౮౬

I U U య I U U య I U U య I U U య.

భజింతున్ సదా కామె♦పల్లీనివాసున్
వ్రజస్త్రీవిటున్ యాద♦వశ్రేష్ఠు నంచున్
భుజంగప్రయాతాఖ్య♦ము ల్నాల్గు యాలన్
గజవ్రాతవిక్రాంతి♦గాఁ జెప్ప నొప్పున్.

తోటకము ౧౨-౧౭౫౬

I I U స I I U స I I U స I I U స.

తగుఁ దోటకవృత్తము ♦ ధాత్రియతిన్, సగణంబులు నాలుగు ♦ సాగినఁ బ
న్నగపుణ్యనదీసుర♦నాథదిశా, జగతీద్విజపట్టణ♦సంచరణా.

జలధరమాల ౧౨-౨౪౧

U U U మ U I I భ I I U స U U U మ.

ధీరుల్ మెచ్చం గృతుల న♦తిశ్రీదం బై, మారాకారా జలధర♦మాలావృత్తం
బై రాజిల్లున్ భువిఁ జతు♦రాస్యక్రాంతుల్, సారం జేరన్ మభసమ♦సంయుక్తం బై.

వంశస్థము ౧౨-౧౩౮౨

I U I జ U U I త I U I జ U I U ర.

జతల్ జరేఫంబులు ♦ సామజాతస, మ్మితాక్షరక్రాంతుల ♦ మెప్పు వుట్టఁగాఁ
బతంగరాజధ్వజఁ ♦ బద్మలోచనున్, నుతింప వంశస్థ మ♦నూన మై చనున్.

ఇంద్రవంశము ౧౨-౧౩౮౧

U U I త U U I త I U I జ U I U ర.

ఇందీవరాక్షుల్ తగ ♦ నింద్రవంశ మా, నందంబునం బాడిరి ♦ నందసూతిపై
డెందంబుల న్మోహము♦లేవ మీఱఁగాఁ, బొం దై గజక్రాంతులు♦పూనఁ దాఁ బ్రలన్.

### ద్రుతవిలంబితము ౧౨-౧౪౬౪

I I I న U I I భ U I I భ U I U ర.

ద్రుతవిలంబిత•రూప మగుం గుభృ, ద్యతి నభారయు•తంబుగఁ జెప్పినన్
నతజనార్తివ•నశ్వసనప్రియా, వితతభూసుర•వీరపురాలయా.

### తోదకము (తామరసము) ౧౨-౮౮౦.

I I I న I U I జ I U I జ I U U య.

సలలితతోదక•సామజవిశ్రాం, తులను నజాయలఁ•దోదకవృత్తం
బలవడుఁ గేతవ•రాసురకాష్ఠో, జ్జ్వలనవశోఖర•సాస్థలవాసా.

### ప్రియంవద ౧౨-౧౪౦౦

I I I న U I I భ I U I జ U I U ర.

విభు శమీరపృథి•వీజరక్షభా, గభవనాలయునిఁ గామెపల్లికా
ప్రభు నభజ్రలను•బ్రస్తుతింప నౌ, నిభవిరామమున•హిప్రియంవదల్.

### ప్రమితాక్షరము ౧౨-౧౭౭౨

I I U స I U I జ I I U స I I U స.

ప్రమితాక్షరం•బమరుఁ బద్మజవి, శ్రమ మొప్పమీఱ•సజసాయుతమై
యమునానదీతటవి•హార పృథా, శ్రమదాకుమారసఖ•భద్రయశా.[1]

### జలోద్ధతగతి ౧౨-౧౮౮౬

I U I జ I I U స I U I జ I I U స.

జలోద్ధతగతిం ది•శాగజయతిన్, మెలంగు నినుమూఱు•మెచ్చగ జసల్
ఫలానుభవ కామె•పల్లినిలయా, ఖలాంబుదసమీర•కామజనకా.

### విశ్వదేవి ౧౨-౫౭౭

U U U మ U U U మ I U U య I U U య.

శ్రీవత్సాంకాపద్మాధ•రిత్రీకళత్రా, దేవేంద్రస్తోత్రా విశ్వ•దేవీసమాఖ్యం జెప్పన్.
బై విప్పాందు న్మాయాగ•ణావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చోద్య•మైయుండఁ

### చంద్రవర్త్మ ౧౨-౧౯౭౯

U I U ర I I I న U I I భ I I U స.

ఇంద్రవంద్య జగ•దీశ ఘనయశ, స్సాంద్ర కామెపలి•సద్మ యదువరా
చంద్రవర్త్మ యగు•శైలవిరతి ని, స్తంద్ర మై రనభ•సంబు లమరినన్.

---

1 (ప. పె) లో ౧౭౭౨ అనియే ఉన్నది. (పూ. ము) లో ౧౭౪౦ ఉన్నది. ఇదిచూచి యిటీవలివారు వ్రాతప్రతులలో సరిగానున్న సంఖ్యను తప్పుగాదిద్దుకొన్నారు.

ప్రహేయము ౧_౨-౫౭౬_

I I Iన I I Iన ∪∪∪మ I ∪∪య.

కరివిరమణముల్ • గా నామయుంబుల్, బరఁగ నిలుపఁ జా•పట్టుం బ్రహేయం
బురగశయన భో•జోర్వీశపుత్రీ, వరపరమకృపా•వారా• కృష్ణా.

ప్రముదితవదన ౧_౨-౧_౨౧౬-

I I Iన I I Iన ∪ I ∪ర ∪ I ∪ర.

మమత నిభవిరా•మముల్ గూడఁగా, జమిలినరములన్ • సదా చెన్నగున్
బ్రముదితవదనల్ • రమానాయకా, సుమశరజనకా • సుపర్వస్తుతా.

కుసుమవిచిత్రము ౧_౨-౯౭౬_

I I Iన I ∪∪య I I Iన I ∪∪య.

కుతలములోనం • గుసుమవిచిత్రం, బతిశుభదం బై • యగయతు లన్నం
దతనయ యొప్పున్ • నయ లినుమా రై, సతతము విద్వ•జ్జనులు నుతింపన్.

మణిమాల ౧_౨-౭౮౧

∪∪ I త I ∪∪య ∪∪ I త I ∪∪య.

కామేపలినామ•గ్రామస్థలవాసా, స్వామీ తయకార•ద్వంద్వంబు పొసంగన్
సేమాఱుమహీభృ•ద్విక్రాంతులతోడన్, భూమండలిఁగూర్పం•బొల్చున్మణిమాలల్.

మేఘవిలసితము ౧_౨-_౨౦౪౧

∪∪∪మ I I I న I I I న I I ∪ స.

కాళిందీముఖ•కమలమధుకరా, నాళీకాసన•నతరసవిరతు
ల్గాల మేఘవి•లసితము దనరు, న్వాలాయంబు మ•ననసగణములన్.

వ. త్రయోదశచ్ఛందం బగునతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదుమూఁడేసియక్ష
రంబు లై యెనిమిదివేలనూటతొంబదిరెండువృత్తములు పుట్టె నందు:—

మత్తమయూరము ౧౩-౧౬_౩౩

∪∪∪మ ∪∪ I త I ∪∪య I I ∪స ∪గ.

శ్రీగోపాలా తంగెడ•సీమావనిగేహా
వాగీశాదిస్వర్గని•వాసస్తుతిపాత్రా
యోగిధ్యేయా మత్తమ•యూరంబున కొప్పున్
నాగక్రాంతుల్ త్యగ•ణంబుల్సగమొందన్.

ప్రహర్షిణి ౧౩-౧౪౦౧

∪∪∪మ।।।న।∪।జ∪।∪ర∪గ.

ధీరుల్ సింధురవిర♦తిఁ మనద్రగంబుల్, సారంబాదములను♦సంఘటించుచుండఁ
గ్రూరారిప్రహరున♦కుం బ్రహర్షణుల్పెం, పారంజెప్పదురుము♦హామదంబుతోడన్.

ప్రభాతము ౧౩-౧౩౯౨

।।।న।∪।జ।∪।జ∪।∪ర∪గ.

మొనసి నజారగ♦ముల్ ప్రభాతవృత్తం, బునకు మదేభస♦మూహవిశ్రమంబుల్
దనరఁగ నిల్చుఁ బృ♦దాకురాజతల్పా, కనకమయాంశుక♦కామెపల్లివాసా.

జలదము ౧౩-౩౫౪౩

∪।।భ∪।∪ర।।।న∪।।భ∪గ.

బంగరుచుంగుపచ్చడము♦పైఁ గలయా, తంగెడదేశవాసు జల♦దంబులచే
తంగడు సన్నుతింతు నవ♦తారయతిఁ, బొంగుచు సారభర్నభగ♦ముల్గదియన్.

మంజుభాషిణి ౧౩-౨౯౬

।।∪స।∪।జ।।∪స।∪।జ∪గ.

ఉరగాపగాదివారి♦దుర్వారాలయా, కరుణాసముద్ర ముర♦గర్వభంజనా
యిర వొందుచుండు సజ♦లిబ్బడింపఁ బల్కురు గాప్తిధాత్ర్యతి♦మంజుభాషిణుల్.

రుచిరము ౧౩-౨౮౦౬

।∪।జ∪।।భ।।∪స।∪।జ∪గ.

గదాధరుఁ జభసజ♦గంబులఁ గవుల్, సదా పితామహయతి♦సాగుచుండఁ గా
ముదంబుతోడ రుచిర♦ము ప్రచింతురి, ట్లుదారభక్తిఁ గృతుల♦మర్వారాఘలిన్.

క్షమ (క్షప) ౧౩-౨౩౬౮

।।।న।।।న∪∪।త∪∪।త∪గ.

క్రమమున నిభవి♦క్రాంతి నాతాగయు, క్తముగ సుకవిప♦ద్యంబు లూహించినఁ
క్షమ నన బరఁగుం♦గంజపత్రేక్షణా, సుమశరజనకా♦సూరవంశోత్తమా.

చంచరీకావళి ౧౩-౧౧౫౩

∪∪∪మ∪∪∪మ∪।∪ర∪।∪ర∪గ.

కంబుగ్రీవాసత్యా♦కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ♦శ్వేర్చిభూభృద్యతుల్గాం
చుంబాదంబైధాత్రిం♦జంచరీకావళీనా, మంబొందుంగావ్యశ్రీ♦మానినీభూషణంబై.

### మత్తహంసిని ౧౩-౨౮౯౦

|U|జUU|త||U స|U|జUగ.

మనోహరాకార • మధుదైత్యసంహరా, వినాయకారూఢ • విబుధేంద్రవందితా
జనార్దనా జత్స•జగురుల్ కుభృద్యతిన్, దనర్చుంబద్యంబు•దగు మత్తహంసినిన్.

### సుమంగలి ౧౩-౧౭౭౨

||U స|U|జ||U స||U సU గ.

సారిదిన్ ధరిత్రిని • సుమంగలివృత్తం, బరయంగ సామజ • యతిన్ సజసాగల్
తిర మొంద నొప్పు వి•ధిపూజితపాదాం, బురుహద్వయా ఖర•మురాసురవైరీ.

వ. చతుర్దశచ్ఛందం బగుశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలుగేసియక్షరంబులై ౧౬౩౮౪ వృత్తములు వుట్టె నందు:—

### వనమయూరము ౧౪-౩౮౨౩

U||భ|U|జ||U స|||న UU గగము.

శ్రీకర ధరాధర•జిష్ణునుత పుణ్యా, శ్లోక భజసన్నగగ•లున్ ద్రుహిణసంఖ్యన్
సోఁకువిరమంబుగను•చున్వనమయూరా, ఖ్యాకమనువృత్తమిల•నత్తమిలుచుండున్.

### వసంతతిలక (సింహోన్నతము, ఉద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి)

### ౧౪-౨౯౩౩

UU|త U||భ|U|జ|U|జUU గగము.

శ్రీమేదినీరమణ•సింధుతరంగరంగ, ద్రామాహితల్ప విన•తాసుతవాహ రాధా
కామా వసంతతిల•కన్ దభజాగగంబుల్, సామప్రభూతయతి•సాగిధరం జెలంగన్.

### భూనుతము ౧౪-౩౭౧౭

|U|ర|||న U||భ U||భ UU గగము.

ముమ్మరించి రనభాగగ•ముల్ దశవిశ్రా, మంబుభూతలమునందున•మానితమయ్యెన్
జాంబవత్యధిప కేశవ•సారసనేత్రా, కంబునందకగదాధర•ఖండితసాళ్వా.

### సుందరి ౧౪-౫౮౧౭

U||భ U||భ U|U ర|| Uస|Uవగణము.

సూరిజనప్రకరంబు • సుందరి నెన్నఁగా
భారసవంబులు రత్న•భాసితవిశ్రమా
ధారముగాఁ ధనరారుఁ • దార్క్ష్యతురంగమా
శౌరి ముకుందమునీంద్ర • సన్నుతకేశవా.

ప్రహరణకలిత ౧౪-౮౧౨౮

। । । న । । । న U । । భ । । । న । U వగణము.

పవిగొను నెపుడుం బ్రహరణకలితన్, ననభనవలు మం దగజవిరమముల్
ఘననిభఘనవి గ్రహ బకమురమ, ర్దన మధునరక ప్రహరణకలితా.

నవనందిని ౧౪-౩౮౨౦

। । U స । U । జ । । U స । । । న U U గగము.

నవనందినిన్ సజగణ స్నగగ లారయన్, నవవిశ్రమంబును ద నర్చి చెలువొప్పన్
నవనీతచోరకు జ నార్దనును పేంద్రున్, భవదూరు నెంతురు స భాసదులుభక్తిన్.

అపరాజితము ౧౪-౫౮౨౪

। । । న । । । న U । U ర । । U స । U వగణము.

ననరసలగ లొంది న న్నవవిశ్రమం, బును గలిగి కవీంద్ర భూషిత మై జనా
ర్దన నిగమనుగోచ రా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్య మై వినువారికిన్.

అసంబాధ ౧౪-౪౦౬౫

U U U మ U U । త । । । న । । U స U U గగము.

వాలాయంబున్ సత్కవిజనములు వాక్రువ్వన్
వాలారున్ గోవింద వరద ధృవి వాత్సల్యా
కాళిందీప్రాణేశ మతనసగ గ ప్రాప్తిన్
జాలాభాస్వద్విశ్రమమునను న సంబాధల్.

కమలవిలసితము ౧౪-౪౦౯౬

। । । న । । । న । । । న । । । న U U గగము.

క్రమమున ననన న గగములు గూడన్, గమలవిలసితము కమలజవిశ్రా
మము జగతిని నగు మహితచరిత్రా, కమలదళనయన కడుఁ బొగడొందున్.

వ. పంచదశచ్ఛందం బగునతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదిహేనేసి యక్షరంబులై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె నందు.

మాలిని ౧౫-౪౬౭౨

। । । న । । । న U U U మ । U U య । U U య.

కనకకశిపుమర్తన్ గానలోలున్ శుభాంగున్
దనుజహరణదక్షున్ ధర్మమార్గానుసారిన్
మనసిజగురు నెంతున్ మాలినీవృత్త మందున్
ననమయయగణంబుల్ నందివిశ్రాంతి గూడన్.

### సుకేసరము (భద్రకము) ౧౫-౧౧౧౮౪

I I I న U I జ U I I భ U I జ U I U ర.

సురుచిరధర్మమూల మయి♦సొంపు మీఱు నా, గిరిధర నాభిపంకజసు♦కేసరంబునై
ఖరి నజభజ్రము ల్గదియుఁ♦గల్పనంబునన్, గిరిశ విరామసంగతి సు♦కేసరంబునన్.

### మనోజ్ఞ ౧౫-౧౧౬౩౭

I I I న U I జ U I జ U I భ U I U ర.

అజమృడవాసవసంత♦తార్చితపాదపం
కజయుగళున్ హరి నిర్వి♦కారు మనోజ్ఞ నా
బుజా వగువృత్తమునందుఁ ♦ బ్రీతి నుతింపఁగా
నజజభరంబులు వొల్చు ♦ నచ్చిన దిగ్యతిన్.

### మణిభూషణము ౧౫-౧౧౨౦౨

U I U ర I I I న U I I భ U I I భ U I U ర.

వింత లైనమణిభూషణ♦వృత్తమునందు న
త్యంతమోదమున నెన్నను ♦ నద్దశవిశ్రమా
క్రాంత మయ్యు రవభారలఁ ♦ గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు ♦ నార్యసమూహముల్.

### సుగంధి (*శాలినీ, చామర, ప్రశాంతి) ౧౫-౧౧౯౨౩

U I U ర I U I జ U I U ర I U I జ U I U ర.

రంబు జంబు రంబు జంబు ♦ రంబు చెన్ను మీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు ♦ తోర మై సుగంధికిన్
క్రమ్మఁగా నుతింప నొప్పుఁ ♦ గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవు ♦ డక్షరాఖ్యుఁ డెప్పుడున్.

### ఇల ౧౫-౧౬౩౬౪

I I U స U I జ I I I న I I I న I I U స.

గజవిశ్రమంబునఁ ♦ గనలు నిల యనఁగా, సజనాస లుండిన♦సకలకవికృత మై
భుజగాశనధ్వజు♦భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ♦వనజహితుఁ బొగడన్.

---

* ౧౧వఛందములో నుతియొక శాలినీవృత్తము గలదు. (3[illegible]9 పుట)

చంద్రరేఖ ౧౫-౪౬..౨౫

UUUమ U।Uర UUUమ।UUయ।UUయ.

మత్తేభక్రాంతిచే రమ్యం బౌ నుహిం జంద్రరేఖా
వృత్తం బౌ మ్రమ్యయంబుల్ వేడ్కన్ హృషీకేశుఁ బార్థ
శ్రుత్త న్నారాయణు న్విశ్వామిత్రయాగారిదైత్య
చ్ఛేత్త న్దానాహ్వ లక్ష్మీచిత్తాబ్జవాను న్నుతింపన్.

నలిని ౧౫-౧౪౦౪౪

IIU స IIUస IIUస IIUస IIUస.

సససాసలచే దళవిశ్రమయుక్తతచేఁ, బొసఁగ న్నలినిన్ మణికంబు సుదర్శనహ
స్తసరోరుహువామనుఁ గేశవు శౌరినజున్, వసుదేవనృపాలతనూభవుఁ బాడుదురా.

అలసగతి ౧౫-౭౬౪౮

II IవI IUస II IవUI IభIUUయ.

అలసగతి నాఁ జను సభాంతరమునందు, న్విలసదవతారయతి నిండి నసనభ్యల్
గలయ శకటాసురవిఘాతను విశిష్టున్, బలుమఱుఁ గవీశ్వరులు ప్రార్థనలు సేయన్.

మణిగణనికరము ౧౫-౧౬౩౮౪

I I IవI I IవI I IవI I Iవ IUస.

మణిగణనికరమనను లఘుగురు వై, మణివిరమణ మయి మధుదనుజహరున్
ఫణిపతిశయనునిఁ బ్రమథితనరకు, న్ఘృణిమదయుతనిభుని బొగడఁ దనరున్.

వ. షోడశచ్ఛందం బగుఅష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాఱేసియక్షరంబు లై ౬౫౫౩౬ వృత్తములు పుట్టె నందు:—

ప్రియకాంత ౧౬-౧౩౨౬౪

I I IవIUUయI I IవIUUయI IUసUగ.

అమరులు భృత్యులనయ విఖ్యద్గంగ ధరిత్రీ
కమలలు [1]పెండ్లాములు రవి శంజారులు గన్నుల్
శమితభృశావర్తున కని చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణ మై న్యన్యసగం బై.

పంచచామరము ౧౬-౨౧౮౪౬

IUజUIUరIUజUIUరIUజUగ.

జరజ్రజంబులున్ గముం బొసంగి తొమ్మిదింటిపై
విరామ మొంది సత్కవుల్ వి స్తరంబు సేయఁగా

1 పెంశాములు.

బరాత్పరుండు మాధవుండు ♦ పంచచామరంబునన్
బ్రరూఢగుంభనంబులంచుఁ ♦ బాడ నొప్పు ధాత్రిలోన్.

పద్మకము ౧౬—౨౩౮౧౬

I I I న U I I భ I U I జ I U I జ I U I జ U గ.

నభజజాగగణయుక్తిఁ బి♦వాకివిరామక
ప్రభవమై కృతుల నొప్పను ♦ బద్మక మందమై
ప్రభుఁడు వక్రమును ద్రుంచి సు♦రక్షితుఁ జేయ సా
మభవపద్మకముచాడ్పున ♦ మానితమై ధరన్.

చంద్రశ్రీ ౧౬-౧౦౧౭౭

I U U య U U U మ I I I న I I U స U I U ర U గ.

క్షమం జంద్రశ్రీతోయమనసర♦గ ల్భానువిశ్రా
మముల్ సంబంధించు న్నరహరి ర♦మాచిత్తచోరా
శమీరాయామ్యాగారా శమనసహా♦జానాథకృష్ణా
పరిమత్తశ్రీవ్యాదక్షణదళన ♦ రాధాభుజంగా.

మేదిని (వాణి) ౧౬-౧౧౧౭౮

I I I న I U I జ U I I భ I U I జ U I U ర U గ.

మృడయతి నజ్భజర్గములు ♦ మేదినిసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ దనరు ♦ దంష్ట్రి పద్మనాభా
జడనిధితల్ప నందసుత ♦ సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి ♦ గావు మయ్య దేవా.

ఫలసదనము ౧౬-౧౬౩౭౮

I I I న I I I న I I I న I I I న I I U స U గ.

ననననసగములు ద♦నరఁగ దశవిశ్రాం
తిని ఫలసదనము ల♦లితశయ మగుచొప్పన్
మునిజనహృదయములఁ ♦ బొలుచువానిన్ (?)
గొనబుగమదమొదవఁ ♦ గొలిచెద మటంచున్.

అశ్వగతి ౧౬-౨౭౭౭

U I I భ U I I భ U I I భ U I I భ U I I భ U గ.

అందము లైనభకారము ♦ లైదును గాంతము నై
పొంది పదింట విరామముఁ ♦ బూనినయశ్వగతిం

గంధసమానమహోన్నత • గాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయుఁగ • వేడుక యయ్యెఁ జామీ.

మదనదర్పణము ౧౬ - ౨౧౫౯౫

–॥భ॥–స॥–జ–।–ర।। –జ–గ.

చారుమదనదర్పణంబు భ • సజజములు ద్గురుల్
మారవిమతవిశ్రమంబున • న్మహిం జెలంగు నా
ధీరుల యమునాతటంబునం • బ్రియంబుఁ జేసి యా
ధీరవరుఁడు గూడె నంచు భ • క్తి సన్నుతింపఁగా.

గజవిలసితము ౧౬-౩౨౭౬౭

–॥భ–।–ర॥న॥న॥న॥న–గ.

బాలసరోజనాభ • వరద తనుమిళితజం,బాల దిగంబరా స • మస్తృణకబళకర లం
బాలక మంగళావ • హ గజవిలసితమున,గ్గా్రిలు భ రేఫ నాన • నగము లిభవిరమ మై.

వ. సప్తదశచ్ఛందం బగు అత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియేడేసియక్షరంబు లై ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె నందు:—

శిఖరిణి ౧౭-౫౫౮౩౦

।––య–––మ॥ ।న॥–స–॥భ। –గగణము.

భజింతు న్నిత్యంబు న్నిజజనసదా • ప్రార్థనపరుఁ
గజేంద్రార్తిధ్వంసిం గృతకలలనా • గ్రావు నజరుఁ
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్ • విశ్వవిరతి
ప్రజాతాహ్లాదం బై శిఖరిణి యనా • భాసుర మగున్.

పృథ్వి ౧౭-౩౮౭౫౦

। – । జ । । – స । – । జ । । – స । – – య । – వగణము.

జసల్ జసయవంబు లున్నకర • సంఖ్యవిశ్రాంతులుఁ
బొసంగి కవిపుంగవుల్ పలుక • భూమిలోఁ బృథ్వి నా
వసంశయ మగుం గళిందతన • యామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృత • పరశ్వధా మాధవా.

హరిణి ౧౭-౪౬౧౧౨

• । । । న । । – స – – – మ – । – ర । । – స । – వగణము.

హరిణి యనువృత్తం బొప్పు న్నభస్మ • రాత్తవిరామ మై
సరి నసమరేఫస్వం బై షోడ • శప్రమదాసహ

ప్రమణుఁ దృణావర్తక్రవ్యాద•సంహారు మస్తకో
పరిరుచిరపింఛాచూడుం బీత•వస్త్రు నుతింపఁగా.

నర్కుటము (కోకిలకాకము) ౧౭-౫౬౭౨౦

IIIన।U।జU।।భ।U।జ।U।జ।Uవగణము.

కొలిచెద నాదిదేవుపద•కోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిబాముసఁ గు•దుర్వ్రుడుపాపములం
దలఁచెద నామధేయ మతి•తత్పరత న్జభజా
వలఁ దగునర్కుటంబునకు • భర్గవిరామములన్.

మందాక్రాంత ౧౭-౧౮౯౩

UUUమU।।భ।।।నUU।తUU।తUUగగము.

మందాక్రాంత న్గిరిశవిరతు • ల్మభ్నతాగాగణంబుల్
పొందె న్నాందీపునివలన సం•పూర్ణవిద్యాచయంబుల్
క్రుందించె న్దారుణరణమునం • బౌండ్రసాళ్వాదులం జే
యందెం జేరిం డదుకులకు నం•దాత్మజుం డంచుఁ జెప్పన్.

పాలాశదలము (త్వరితగతి) ౧౭-౩౨౭౬౮

।।।న।।।న।।।న।।।న।।।నUU గగము.

అదనదనున హరినుతు • లమర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి•జనులు వచియింపన్
బదునొకఁ డగునెడ యతి • పదిలమునఁ జేరన్
గదియు నగణములయిదు • గగము తుద నొందన్.

వంశపత్రపతితము ౧౭-౬౪౫౧౩

U।।భU।Uర।।।నU।।భ।।।న న।Uవగ.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ • భరవభనలగల్
సాగి పినాకివిక్రమమునన్ • సభలనుఁ గుదురై
రాగిలువంశపత్రపతిత • ల్రణమున నరకు
న్రాగతనంబునం దునిమె నం•దతనయుఁ డనినన్.

చంపకకేసరి ౧౭-౭౮౯౯౦-౨౯

॥ ∪స । ∪ । జ ॥∪స॥ ∪స॥ ∪స । ∪వగ.

సనకాదియోగినుతు ♦ జాంబవతీప్రియు నిర్వికా
ల్ప వమేయు నక్షర వి♦భు న్యమళార్జునభంజనున్
వనమాలిఁ గృష్ణు మర♦భంజను సెంతుర వారిజా
సనవిక్రమంబు సజ♦సాస్వలు చంపకకేసరిన్.

వ. అష్టాదశచ్ఛందం బగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిదియక్షరంబులై ౨౬౨౧౪౪ వృత్తములు పుట్టె నందు:—

మత్తకోకిల ౧౮-౯౩౦౧౯

∪।∪ర॥∪స।∪జ।∪జ∪॥భ∪।∪ర.

అత్తమిల్లు మహేశవిక్రమ ♦ మార్యసమ్మతి నొప్పఁగా
సత్తు లౌ రసజాభరేఫలు ♦ చాకళింపుచు నొందఁగా
మత్తకోకిలవృత్తపద్ధతి ♦ మక్కువం బొనరింపఁగా
హత్తి పూజ యొనర్ప వచ్చు జ♦నార్దనాహ్వయు సెప్పుడున్.

కుసుమితలతావేల్లిత ౧౮-౩౭౮౫౭

∪∪∪మ∪∪త॥న∪∪య।∪∪య।∪∪య.

వేమా ఱెన్నంగాఁ గుసుమితలతా♦వేల్లిత న్మత్నయాయల్
శ్రీమార్తండక్రాంతియుఁ గుదిరినం ♦ జెన్ను మీఱు న్ధరిత్రిన్
గామేపల్లీశుం గనకవసనుం ♦ గంజనేత్రున్ శుభాంగున్
గోమద్భాలుం, గాలయవనహరుం ♦ గుంజరేంద్రార్తినాశున్.

నిశ ౧౮-౭౪౯౪౪

॥న॥న∪।∪ర∪।∪ర∪।∪ర∪।∪ర.

ప్రబలు నిశను నార♦రారంబుల వ్రిత్నవిశ్రాంతియున్
గబళితదవపావ♦కాపూతనాజీవితాహారి కృ
ష్ణ బలసహజ పారి♦జాతాపహారా యదుశ్రేష్ఠ దే
వబలదమనవంద్య ♦ బంహిష్ఠ వార్ష్ణేయ శైనేయకా.

హరనర్తనము ౧౮-౯౯౭౧

∪।∪ర॥∪స।∪జ।∪∪య∪॥భ∪।∪ర.

దేవపావకఖాది మా♦ధవ దాశార్హా♦దనుజాంతకా
దేవకీప్రియనందనా♦దివిషద్వంద్యా♦భుప్రసన్నతా

భావగోచర విశ్వరూ • ప దళన్ ప్యారు • వ్వ ననర్తుసం
ఖ్యావిరామము రేఫస • జ్యభరేఫంబుల్ • హరన ర్తనన్.

క్ష్మాహారము ౧౮-౩౦౮౭౪౧

UUU మ | | | న | UU య UU | త | | | న UUU మ.

బాహాబాహిని దమలో • భ్రాతల్ దొడ్డ • పగలఁ బోరాడం
గా హంవీరుఁ డగుబుభు • క్ష్మానూనుల్ జ • గతిని గూలంగా
నాహా యేసినవరపా • లా రత్నేషు • యతులు పొందంగా
క్ష్మాహారంబు మనయత • న్నంబుల్ చెంది • [1]మనసు నందం బై.

వ. ఏకోనవింశతిచ్ఛందం బగునతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బందొమ్మిదేసి య
క్షరంబు లై ౫౨౪౨౮౮ వృత్తములు పుట్టె నందు:—

శార్దూలవిక్రీడిత ౧౯-౧౪౯౩౭౭

UUU మ | | U స | U | జ | | U స UU | త UU | త U గ ము.

నీరేజాంచితలోచనాయ హరయే • నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే • హార్యక్షవక్త్రాయ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీ • హా విశ్వవిశ్రాంతి వి
స్తారింప న్మసజస్తతంబులు గము • న్శార్దూలవిక్రీడితన్.

తరళ ౧౯-౧౮౭౭౦౮౦

| | | న U | | భ U | U ర | | U స | U | జ | U | జ U గ ము.

జలజలోచనుఁ గైటభాంతకు • శంఖచక్రగదాధరున్
గలశజాదిమునీంద్రసేవితుఁ • గాళియాంతకు నచ్యుతున్
బలుకుచోఁ దరళంబు లందుల • భానువిశ్రమపద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమ • కట్టి చెప్పుదు రుత్తముల్.

మేఘవిస్ఫూర్జితము ౧౯-౭౫౭౭౧౪

| UU య UUU మ | | | న | | U స U | U ర U | U ర U గ.

శ్రమాలక్ష్మీనాథున్ విదురవరదున్ • జాహ్నవీజాతపాదున్
మ్నాయ స్తవ్యున్ గరుడతురగున్ • సామజప్రాణదాతన్
ఁ జేర్కొన్న న్సభలఁ దనరు • న్మేఘవిస్ఫూర్జితంబుల్
గుర్వున్ యమ్నసరరగము • ల్విశ్వవిశ్రాంతిచేతన్.

చంద్రకళ ౧౯-౧౪౬౭౫౨

◡।◡ర॥◡స॥◡స◡◡।త।◡।జ।◡।జ◡గ.

తానకంబుగఁ జంద్రకళావృ • త్తంబు కవు ల్విరచించిరన్
మీనులార మనోజ్ఞపదంబుల్ • పేర్చి కపర్ది విరామ మై
కాన వచ్చి రసస్తజజంబుల్ • గంబు దనర్చి కళిందజా
మానినీరమణ స్తవగాథా • మానితరత్నములం దగున్.

భూతిలకము ౧౯-౧౪౬౦౩౯

◡।భ◡॥భ◡।◡ర॥◡స।◡।జ।◡।జ◡గము.

భారసజాగగణంబులుం బఱ • వంగ భానువిరామవి
స్ఫారత భూతిలకంబు పాండవ • పక్ష దైవతవృత్త మిం
పార ధరిత్రికిఁ దెచ్చినట్టిమ • హాత్ము యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన • శ్రావ్య మౌ వినువారికిన్.

కవికంఠభూషణము. ౧౯-౧౮౮౯౦౦

॥◡స।◡।జ॥◡స॥◡స॥◡స।◡।జ◡గ.

నవరత్నవిశ్రమము • నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము • గా రచియింతురు మాటిమాటికి
శ్రవణిల్లుకబ్బమున • నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్కథాసుధలఁ • దత్పరు [1]లైన మహాత్ము లట్లుగాన్.

వ. వింశతిచ్ఛందం బగుకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసియక్షరంబు లై ౧౦౪౮౫౭౬ వృత్తములు పుట్టె నందు:—

మత్తేభవిక్రీడిత ౨౦-౩౯౪౬౮౬

॥◡స◡॥భ◡।◡ర।॥న◡◡◡మ।◡◡య।◡వగణము.

మనువిశ్రాంతిని సభరనమ్యవములన్ • మత్తేభవిక్రీడితా
హ్వాను వృత్తంబు చెలంగె మానవతులా • రా వీఁడె యేతెంచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చునాఁడు యమునా • తీరంబునం బొంది నే
డ్కను మాచీరలు దోఁచుకొన్న వెడదొం • గం జూచినారా యనన్

1 తవరారునట్లుగాన్.

న్వ్రజసుందరీజనము లొక్క•నాఁడు మణిమాలయందుఁ బొసఁగ
న్సజము త్రివారము సముం బి•నాకివిరమంబు పొందు దనరన్.

కరిబృంహితము ౨౧-౭౮౨౨౭౧

U।।భ।।।న U।।భ।।।న U।।భ।।।న U।U ర.

మూఁడు భనములు రేఫమును బదు • మూఁట విరతియు సొంపుగాఁ
గూడుకొనఁ గరిబృంహితము సమ•కూర్చి వసుమతి మండలా
పీడ మనుకరిబృంహితరవము • పెల్లుగఁ బలుకుచుండఁగాఁ
గోడిగపు¹చిననాఁడు శకటునిఁ • గూల్చినహరి నుతించెదన్.

కనకలత ౨౧-౧౦౪౮౫౭౬

।।।న।।।న।।।న।।।న।।।న।।।న।।U స.

జవమున భగభగ యనుచు ప్ర•జజనములఁ బొదవినం
దవశిఖి నుడిపినమధుముర • నరకదమన యని పే
లవముగఁ బలుమఱు నిరువది • లఘువులు గము పదుమూఁ
డవయెడ విరతిఁ బొసఁగిన బెం•డఁ గడుఁ గనకలతన్.

వ. ద్వావింశచ్ఛందం బగునాకృతియందుఁ బ్రతిపాదంబున కిరువదిరెండేసి యక్షరం
బులై ౪౧౯౪౩౦౪ వృత్తములు పుట్టినం:—

మహాస్రగ్ధర ౨౨-౬౦౫౯౮౮

।।U స UU।త UU।త ।।న।।U స U।U ర U।U ర U గ.

స్తతనస్రాగ ల్విరించాష్టవిరతులు మహా•స్రగ్ధరం జెప్ప నొప్పన్
గ్రతువిఘ్నుం బావహిల్లం • బ్రమదమున వ్రజ•వ్రాతదత్తాన్న మెల్లన్
క్షితిభృద్రూపంబున స్తా•క్కి నరుష నమరా•గ్రేసరుం డంప బ్రుబ్బల్
ధృతిపై జాల్వాఁ ²గూల్పన్ • దివిరి కరుణతో•³ధేనువృద్ధ్యద్రి మోఁచెన్.

భద్రకము ౨౨-౧౯౩౦౭౧౧

U।।భ।U।ర।।।న U।U ర।।।న U।U ర।।।న U గ.

భంబు రనత్రయంబు గమూ నొంది • భానుయతి భద్రకంబు దనరున్
బంచినపిల్లగోల కరయుగ్మ • పాదములఁ బట్టి యూఁది పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ • గాచుసమయంబున న్యమున తీ
రంబున గొల్లలం గలసి యోగి•రంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకన్.

---

1 చిననాఁడుటకుసల. (పె). 2 గూల్పన్ (ఓ); గూల్వన్(ప) గుర్వన్ (పూ.ము). 3 ధేనువర్ధాద్రి (పూ.ము).

### మానిని ౨౨-౧౭౯౭౫౫౯

U॥భU॥భU॥భU॥భU॥భU॥భU॥భUగ.

రాజిలు సప్తభము ల్గము విశ్వవి•రామము మానినియందు భర
ద్వాజముఖప్రమునీశ్వరు లందఱు • దైత్యగురుల్ భృగువాక్యమునన్
రా జలనాయకతల్పుని దైవత•రాజు నజస్రము గొల్తురు వి
భ్రాజితమోక్షము చేకుఱఁ బుణ్యధ•రాస్థలి నంచు వచించుటచేన్.

### విచికిలిత ౨౨-౨౦౯౭౧౫౨

॥|న॥|న॥|న॥|న॥|న॥|న॥|నUగ.

ప్రవిలయసమయమునను బద•పడి జలనిధినడుమ స
ద్భువనములు కడుపున నిడుక • భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుకువరదుఁ • డని విచికిలితఁ బదుమూఁ
డవయెడ వడి యిరువదియొక•లఘువు గము బలుక నగున్.

### తురగము ౨౨-౧౪౯౦౯౪౪

॥|న॥|న॥|న॥|న॥Uస|U|జ|U|జUగ.

నననననసజజగలు తిథివిరమ•ణం బగు న్దురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన • గాంచి తా నొకరుం డెదు
ర్కొని దవులకుఁ గొని చని గిరిగుహఁ • గూర్కొనాముచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు•ధ న్గణింతురు భూసురుల్.

### [1]మద్రకము ౨౨-౧౯౪౭౦౯౫

U॥భU|Uర॥|నU|Uర॥Uస॥Uస॥|నUగ.

అధ్వమునందు నడ్డమయి వా•హనాకృతి నున్నబకాసురు మహా
సాధ్వసదు న్వ్రజార్భకవినా•శనక్షము వక్త్రముఁ జొచ్చి సురల్
శ్రాధ్యగులై నుతింపఁగఁ దదీ•యదేహము వెల్లినఁ గృష్ణునుతి న
క్రధ్వజమద్విరామము భర•న్రసానగలుం దగుమద్రకమునన్.

వ. త్రయోవింశతిచ్ఛందం బగు వికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁడేసి యక్షరంబులై ౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె నందు:—

---

1 ఇది (ప) లో మహాస్రగ్ధర తర్వాత ఉన్నది.

కవిరాజవిరాజితము ౨౩-౩౫౯౫౧౨౦

|||న|U|జ|U|జ|U|జ|U|జ|U|జ|U|జ|Uవగణము.

కలయఁగ నొక్క న•కారము నాఱుజ•కారములు న్వమ • గాటముగా
నలరినచో ద్విర•దాచలశైలము • లై త్రివిరామము • లంది నిర
ర్గళకవిరాజవి•రాజితవృత్తము • రాణ జనార్దన రమ్యకథా
వళులఁ గవీశులు • వర్ణన సేయఁగ • వ్రాలు నజస్రము • వావిరిగన్.

అశ్వలలిత ౨౩-౩౮౬౧౪౨౪

|||న|U|జ|U||భ|U|జ|U||భ|U|జ|U||భ|Uవగ.

సలలితవిశ్వవిశ్రమము నజ్భ•జ ల్భజభవంబు లశ్వలలితన్
జెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి • చిన్నిసమయంబునందున నులూ
ఖలమునఁ గట్టి వైచినను బిడ్డ • [1]కన్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపినకృష్ణుఁ గీర్తనము సేయఁ • గాఁ దనరు సర్వకాలముల ధరన్.

పద్మనాభము ౨౩-౧౧౯౮౩౭౩

UU|తUU|తUU|తUU|తUU|తUU|తUU|తUUగగము.

వేమాఱు నప్పద్మనాభంబున న్విశ్వ•విశ్రాంతిరూ న్సప్తతంబు ల్గగంబుల్
గోమారుగా దేవతాత్రించరుల్ క్షీర•కూపారమధ్యంబున న్వేఁపుమీఁదన్
భ్రామంగ మంథాచలం బోపికం గచ్ఛ•పస్వామి యై మోచె నీకృష్ణుఁ డంచున్
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ • వ్రాలు న్ధరిత్రి న్సదా మానితం బై.

మత్తాక్రీడ ౨౩-౪౧౯౪౦౪౯

UUUమUUUమUU|త|||న|||న|||న|||న|Uవగ.

మత్తాక్రీడాఖ్యం బెం పారు • న్మమతనననన • మహిత మగుచు ర
త్నాత్రిబ్రహ్మాక్రాంతు ల్గ్రిం దై • యమరగ రణమున • నధికబలు మదో
న్మత్తుం జాణూరక్రవ్యాదు • న్మనురనమునఁ బెస • మరలి పిడికిటన్
సత్తామాత్రుం డుర్విం గూల్చె • న్సకలదివిషదులు • సమతను బొగడన్.

వ. చతుర్వింశతిచ్ఛందం బగుసంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాలుగేసియ
క్షరంబు లై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

---

1 (ప) లో పాఠము ఇందులకు భిన్నముగానున్నది కాని దానిపై గీతలు గీచి యుండుటచే స్పష్టముగా లేదు. మఱికొన్ని తాటాకుపుస్తకములు చూడవలెను.

సరసిజము ౨౮-౭౩౭౭౧౯౩

UUUమUUతUUయ|||న|||న|||న|||నUస.

సంబంధించు న్మత్యలు నానా॥సలు దశనిధియతి ♦ సరసిజమునకుఁ
గంబూర న్బృందాటవిలోనం ♦ [1]గవిసికొనినసుర॥కరువలిదనుజుఁ
శంబాళీలం బై తగుముష్టిం ♦ జదిపినయదుపతి॥ స్తవములు వనురా
గం బూర న్సోభిల్లఁగఁ గ్రౌంచ॥త్కాదివిదరు లభినుతిఁ ♦ గలుపుడు రవనిన్.

క్రౌంచపదము ౨౮-౮౧౯౩౮౭౯

U||భUUUమ|||UసU||భ|||న|||న|||నUUయ.

పంచమకేశుం డిచ్చినభాస్వ॥ద్వరమున మనమున ♦ బవరము గోరఁ
వంచనతో బాణాసురుహ స్త॥వ్రజములు దరిగెను ♦ వడి హరి యంచు
న్బాళించితలీల న్యంశరనంది॥ప్రకటితవిరతులు ♦ భమసభనాన్యల్
క్రౌంచపదీవృత్తమునఁ జె న్నా॥రఁగఁ బలుకుదు రిలఁ ♦ గవివరు లెల్లన్.

తన్వి ౨౮-౮౧౫౫౩౬౭

U||భUUత|||న|||UసU||భU||భ|||నUUయ.

దూడలతోఁ గాపరులను గుహలో ♦ దొంగిలిదాచినవిధి నదలింపన్ ;
గూడుక తద్రూపము లయి పసులుం ♦ గోపవధూటులు మురిపము నొందన్
బాడి వినోదంబులు సలిపినగో॥పాలుఁ డటంచును భతనసభాన్యల్
దాడి గొన న్యశ్వవిరమణముతోఁ ♦ దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్.

అష్టమూర్తి ౨౮-౩౬౧౮౫ ౨౧

UUUమ|||నUUత|||UసU|UరU||భ|UజUUయ.

శ్రీకృష్ణం గనకవస్త్రు౦ ♦ జితతృణావర్తదైత్యు ♦ న్సితకుశేశయనాభున్
వైకుంఠు న్వరదు బృందా॥వనచరు న్వాసుదేవు ♦ న్వసుమయుం బరముం బ
ద్మాకాంతు న్నిధినిధానా॥మలవిరామంబు లొప్ప ♦ న్మతసగ్భజయుంబుల్
సోకం జెప్పుదురు విద్వాం॥సు లిలలో నష్టమూర్తి॥న్సుప్రతిభు లృతచర్యల్.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసి యక్షరంబు లై ౩౩౫౫౪౩౨ వృత్తంబులు పుట్టె నందు:—

బంధురము ౨౫-౧౮౩౬౭౭౬౭

|||న|||న|||న|||నUసU||భU||భU||భUగ.

సౌరిది నననసభభభగములతో ♦ షోడశసంఖ్యవిరామముతో
బరువడి దివదినమును బుధజను లీ॥బంధురవృత్తమునందు నుతిం

1 గవను (ప).

తురు హిమకరకుసుమము నొసటను గన్ను న్ఫణిపొగయుఁ దాల్చినయా
దొరజడలనడుమనిలిచిన తెలుపుం ♦ దూకొనువాఁగుకుఁ దండ్రి యనన్.

భాస్కరవిలసితము ౨౫-౮౩౮౧౩౧౧

UIIభIIIనIUIజIUUయUIIభIIIనIIIనIIUసUగ.

చెల్లెలి విజయున కిచ్చినవానిం ♦ జేరెడుపృథుకములు దినినవానిన్
గొల్లతలను వలపించినవానిం ♦ గొల్లకుఁ గొడు కనఁ బరఁగినవానిన్
మల్లుర రణమునఁ జంపినవాని ♦ న్భజ్ఞయభనవసగలు పదుమూఁటన్
బల్లిద మగువిరమంబు దలిర్ప ♦ న్భాస్కరవిలసితములు గొనియాడున్.

ధరణిధరగతి ౨౫-౧౬౭౭౭౨౧౬

IIIనIIIనIIIనIIIనIIIనIIIనIIIనIIIనUగ.

వసునములు గము ♦ వసువసుయతులు ♦ వల నగు ధరణిధరగతిన్
గస రొదవి సుడి♦కరువలిపగిదిఁ ♦ గదసి యదుశిశుచయముతో
§మసలెడునెడ ముర♦మథన నినుఁ గొని ♦ మదిని నలరుచు నెగసి యా
కసమున కెగయఁ♦గ శకటదనుజా♦త్మమఁ గలిపితి వని పలుకన్.

వ. షడ్వింశతిచ్ఛందం బగునుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదారేసి యక్షరంబు లై ౬౭౧౧౮౬౪ వృత్తంబులు వుట్టు నందు:—

భుజంగవిజృంభిత ౨౬-౨౩౮౫౪౮౮౪

UUUమUUUమUUతIIIనIIIనIIIనUIUరIIUసUIవగ.

త్రాలు న్రత్నేశానక్రాంతు♦ల్వహి మమతననరస♦వల్ భుజంగవిజృంభితన్
గాళిందీయోషం బెండ్లాడ ♦ న్సరదనుజుఁ దునిమెను శి♦ఖావలాంచితపింఛమున్
మాలిం దాల్చె న్భండీం ద్రోచె ♦ న్మఱఁదికి రథముఁ గడపె♦మద్దిచెట్టులు రెండు ని
ర్మూలించె[1] న్దాలంబుల్గూల్చెన్♦మూగుదలు భ్రమయమురళి♦న్మ్రోయఁజేసెవిభుండనన్.

వరాహము ౨౬-౮౩౮౮౬౦౧

UUUమIIIనIIIనIIIనIIIనIIIనIIసUUగగ.

రాజిల్లు న్గళకుధరవి♦రతులు మగణ♦రసనసగగలు వరాహాఖ్యన్
జేజే లందఱు పొగడ నుఁ♦చితుఁ డని తలఁ♦చి భృగువు పలుకఁగ నిత్యంబున్
తేజశ్శ్రీ పెరుగఁగ మది♦[2]దృఢముగ నిడి♦తిమురుచుఁ గొలిచిరి దాశార్హున్
రాజీవాక్షుని నరహరి♦రవికులవరు♦రఘుపతి బలసహజున్ గృష్ణున్.

---

§ ఇచ్చటగ్గణభంగము. 1 మద్దిచెట్టులఁగూలిచెన్, దాలంబుల్గూల్చె న్వేగన్ ముగ్ధలు భ్రమయఁగను మురళిదాలిచెన్ సువిభుండనన్.(ప్రా.ము). 2 ధృవముగ(పు).

### మంగళమహాశ్రీ ౨౬-౧౫౬౭౮౨౩౭

⏑||భ|⏑|జ||⏑|స||న⏑||భ|⏑|జ||⏑|స||| న⏑⏑గగము.

పొత్తు లెడఁబాయుటను ♦ బోరుసమయంబునను ♦ బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్
దుత్తుమురు సేయఁగఁ గు ♦ దుర్చును నుసిష నది ♦ దుష్టసమరావనిఁ గిరీటి
త్కృత్తకు భజస్న భజ ♦ సానగలు మణ్యజాల ♦ క్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర ♦ నిచ్చిరి సువాసినులు ♦ నిం పడర మంగళమహార్తుల్.

క. పొందుగ నిరువదియాఱగు, ఛందములం దుదయ మైన ♦ సమవృత్తము లా
నందమునఁ గవులు పొగడెదు, కందువల వచించినాఁడఁ ♦ గామెపలీశా. 178

వ. ఇవి సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు లెఱింగించెద. 179

### ముఖ్యగౌణవృత్తలక్షణము.

సీ. సమవృత్తపఙ్క్తి స్వ ♦ స్థానార్ధసమములు స్వస్థానవిషమాఖ్యఁ ♦ జనఁ నవియును
బృథివిపై సమవృత్త ♦ భేదంబు లీమూఁటి కక్షరంబులు సమం ♦ బన్నికాళ్ల
నివి వృత్తముఖ్యంబు ♦ లిఁకఁ బరస్థానార్ధసమవృత్తములు పర ♦ స్థానవిషమ
సంజ్ఞలఁ బద్యము ♦ ల్సర్వపరస్థానవిషమంబులును నివి ♦ విషమవృత్త
తే. భేదములు వీనినాలుగు ♦ పాదములను, సమముగాఁ జూపడవు వర్ణ ♦ సంఖ్య లెచ్చు
కడమ లై యుండు నీమూఁటి ♦ గౌణవృత్త, పద్యములటం డ్రు శ్రీకామె ♦ పల్లినిలయ.

### సమవృత్తవివేకము.

గీ. జగతి సమవృత్త మెన్నవ ♦ ఛందమునను, సంభవము నొందె నన్ని య ♦ క్షరము లమరఁ
బదపదంబున హెచ్చును ♦ గొదువ గాక, ప్రాసములు విరామంబులుఁ ♦ బరిఢవింప.

### స్వస్థానార్ధసమవివేకము.

ఆ. అక్షరములు సమము ♦ లయ్యె స్వస్థానార్ధ, సమములందు నాల్గు ♦ చరణములను
విషమపదము లొక్క ♦ విధముగణంబులు, సమపదంబు లొక్క ♦ సరిగణములు. 182

క. సగ మొక్కవిధంబునఁ బెఱ, సగ మొక్క తెఱంగు గాఁగ ♦ సమకూర్పఁదగున్
జగతి నొకకొ లొకకరణి, నొగి మూఁడుపదంబు లొక్క ♦ యోజం దనరున్.

తే. సాధుకవికృతగ్రంథసం ♦ జాత మెల్ల, వెదకి సకలోపజాతుల ♦ విచ్చలవిడిఁ
గాళిదాసుఁడు రఘువంశ ♦ కావ్యమునను, జెలఁగి రెండవసర్గలోఁ ♦ జెప్పినాడు. 184

వ. అటు గాన స్వస్థానార్ధసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము. 185

### ఉపజాతివృత్తము.

ఈపాటితో వేసుల ♦ నింద్రవజ్రం, బుపేంద్రవజ్రాహ్వయ ♦ మూర్వ్యసర్గం
దాపించినంతం గరుణాసముద్రా, ఒపిష్ఠలోలా యుపజాతి యయ్యెన్. 186

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాచ్ఛాయను బేసిపాదాలును నుపేంద్రవజ్రాఛాయను సరిపాదాలును నడుచును. [1]దీనిపేరె నిశి. 187

మఱియు, వ్యత్యస్తోపజాతి.

తలంబులై బేసి జ•తజ్జగగంబుల్, చాలొప్పసర్లందత•జల్గగగంబుల్
జలంబుతోనిట్లు • సాగినంతన్, వాలారు వ్యత్యస్తము • వాసుదేవా ! 188

వ. ఇది ఉపేంద్రవజ్రచ్ఛాయను బేసిపాదాలును, ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 189

సమోపజాతి.

తాపింఛనీలాంగుఁ బృ•దాకుతల్పుఁ, గోపాలబాలు న్రవి•కోటితేజుఁ
గృపాసముద్రు న్నుతి•యించెద న్సు, కృష్ణ్యపాధిఁ గాంక్షించి స•మోపజాతిన్. 190

వ. ఇంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములను నుపేంద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములను నడుచును. మఱియు, 191

వ్యత్యస్తసమోపజాతి.

తపంబుచేఁ గొల్తు వి•ధాతృతాతన్, గపాలికోదండవి•ఖండనాఖ్యున్
గోపీభుజంగున్ ధృత•గోత్రు సన్నో, క్షోపాయు వ్యత్యస్త స•మోపజాతిన్. 192

వ. ఇది యుపేంద్రవజ్రాచ్ఛాయను మొదలిరెండు పాదములును నింద్రవజ్రాచ్ఛాయను గడమ రెండుపాదాలును నడుచును. మఱియు, 193

వైపరీత్యోపజాతి.

తాజల్గగంబొంట జ•తజ్జగంబుల్, గజిక్కన మ్మాఁటను•గంతువేయన్
వ్రజాంగనావల్లభ•వైపరీత్యో,పజాతివృత్తంబు స•భం జెలంగున్. 194

వ. ఇది యింద్రవజ్రాఛాయను మొదలిచరణమున నుపేంద్రవజ్రాఛాయను గడమ మూఁడుచరణములును నడుచును. దీనిపేరె [2]వాతాంగియు, మఱియు నీవృత్తముననే యింద్రవజ్రాచ్ఛాయను ఏదైన నొకచరణమును నుపేంద్రవజ్రాచ్ఛాయను ఏదైన మూఁడుచరణములును జెప్పినను తప్పులేదు. మఱియును, 195

ఉపచిత్ర.

భిదురంచిసపావలు • బేసులన్, గాదిలి భాభగ•గంబులు సర్లన్
గుదురై రసికస్తుతి•గూడినన్, శ్రీదయితా యుప•చిత్ర చెలంగున్. 196

1 ఈవాక్యము పూ. ము. లలో లేదు.

2. వారాంగిని (పూ. ము); వారాంగి యనుటయు నొప్పును. (చూ. అ. 4. 207)

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తచ్ఛాయను బేసిపాదములను దోదకవృత్తచ్ఛాయను సరిపాదములను నడుచును. మఱియు, 197

## నారీనుతము.

పేరెంబు ల్వారోరి • బేసి న్మతాగా, సారంబు సర్లన్ దత • జల్గగంబుల్
ధీరోదాత్తుల్ సన్నుతింపన్ ధరిత్రిన్, నారీనుతం బయ్యె జ • నార్దనాఖ్యా. 198

వ. ఇది పదునొకొంటం ద్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తచ్ఛాయను బేసిపాదములును నింద్రవజ్రాచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 199

## అజితప్రతాపము.

జలజాక్ష! బేసుల స • జల్ ససలున్, బలుమఱున్ సరి న • భజ్ర లొందఁగా
జలజోద్భవాబ్జజవి • శాలయతుల్, దశము లైన యజి • తప్రతాపమా. 200

వ. ఇది పండ్రెండవ జగతీచ్ఛందస్సునందలి ప్రమితాక్షరవృత్తచ్ఛాయను సరిపాదములను ప్రియంవదావృత్తచ్ఛాయను బేసిపాదములను నడుచును. మఱియు, 201

## రతిప్రియము.

బేసి న్నజరగలు • పేర్చి సర్ల జంబుల్, భిసజ్జగల్గదిసిన • పాదబద్ధ మై
యాసామోద్భవచతు • రాస్యవిశ్రమఖ్యాతి సన్నుతింపఁదగు ర • తిప్రియం బనన్.

వ. ఇది పదుమూఁడవ అతిజగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను బేసిపాదములును రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును. 203

ఇది స్వస్థానార్ధసమవృత్తలక్షణం బింక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన:—

## స్వస్థానవిషమవృత్తవివేకము.

ఆ. చరణములను వర్ణ • సంఖ్యలు దప్పక, నాల్గుపాదములగ • ణములు నాల్గు
విధము లై చెలంగు • వృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంఖ్య • వెలయుచుండు. 204

## ధరణి.

రసపై సచతుష్కము • రారసలున్, నసనల్ మాసనల్ • నాటిన న్మణితా
పసనగరస • పరిపక్వయతుల్, లాఙ్రి సొం పారు న్యా • లాయము గా ధరణుల్. 205

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమునను గడమ మూఁడుచరణములును గవికల్పితము లై నడుచును. మఱియు, 206

## వారాంగి.

తాజల్గయుఁగ్మంబు జ • తజ్జగంబుల్, తజాగగంబుల్ మభ • తల్లగంబుల్
రాజిల్లు నిశాంద్రవి • రామయుక్తిన్, వాజిగ్రీవా హరి • వారాంగి దగున్. 207

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునను నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండవచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయను నాలవచరణమునను నడుచును. మఱియు, 208

అంగజాస్త్రము.

రంగు భమసగల్ ♦ గ్రాలు మసజగల్, పొంగి మన్యగ♦ము ల్రజగ లొ
ప్పంగా నార్త♦వగిరివ శ్లైతే, నంగజాస్త్రవృత్త ♦ మందగించుఁగా. 209

వ. ఇది రుగ్మవతీఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయను మూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచరణమునను నడుచును. మఱియు, 210

నదీప్రఘోషము.

పోలిమై రారరం♦బుల్ జతన్రంబులుఁగా
తలంచఁగా యాయమలుఁగా ♦ దతజ్రలుఁగా
విలాసాచలాష్టేభ♦విశ్రాంతితోడఁగా
దేలింప నొప్పారు న♦దీప్రఘోషముల్. 211

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును. 212

ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్ధసమవృత్తవివేకం బెఱింగించెద:—

పరస్థానార్ధసమవృత్తవివేకము.

క. మానుగ సమాంఘ్రి లోకగతిఁ, బూనిక విషమాంఘ్రి లొక్క♦పోలికలిపుడై
హీనాధిక్యములు పరస్థానార్ధసమంబులందు ♦ సమవిషమములఁగా. 213

మనోహరవృత్తము.

పేరై నతజజ్వలు ♦ బేసియెడఁగా, సరులఁగా సచతుష్కము ♦ సాగిన గం
భీరేభపితామహ♦విశ్రమముల్, పెనుగంగ మనోహర♦వృత్తము లౌ. 214

వ. ఇది కలితాంతవృత్తచ్ఛాయను బేసిచరణములును దోటకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 215

కేతుమతి.

జతబేసుల న్సజనగముల్, భాతి సరిఁగా భరే♦ఫనగగంబుల్
యతిశైలసంఖ్య ♦ నమరఁగా, నాతతకేతుమ♦త్యభిధ మొప్పుఁగా. 216

### వేగవతి.

సగణత్రయగల్చను జేసిక, బాగుగ సర్గను భత్రిగగంబుల్
నగవిశ్రమ మందము నొందున్, వేగవతీనుతవృత్తమునందున్. 217

### వియోగిని.

ససజల్ గముసాగ జేసులన్, బసస్భ్ర ల్గము భాసిలున్ సరిన్
రసశైలవిరామసంగతిన్, బొసఁగు న్యోగిని భూరమాధిపా. 218

### పరావతి.

ఓలి రజ్రజాంతగంబులంచి జేసులందులన్ జరజ్రగంబులుం [1]గుదుర్పరింపఁగ్
గ్రాలుచు న్నిధానదిగ్విరామ మొప్పఁగానిలం బరావతీసువృత్తమింపుగాంచున్.

### ద్రుతమధ్య.

బారిగ జేసుల భాభగగంబుల్, సరుల నజాయులు సాగఁగమే ల
య్యారశిలోచ్చయ హస్తివిరామో, [2]దారత నొప్పును దా ద్రుతమధ్యన్. 220

వ. ఇది దోదకవృత్తచ్ఛాయను బేసిచరణములును తోదకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 221

ఇది పరస్థానార్ధసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవివేకం బెఱింగించెద:—

### పరస్థానవిషమవృత్తవివేకము.

క. దానవహార యొకచరణం, బైనను రెండడుగు లైన నక్షరగణసం
ధానములను బెఱ తెఱ వగు, వీనికిఁ బేరు పరదేశవిషమము లయ్యెన్. 222

### శరభక్రీడ.

ఘనాదిత్యక్రాంతి న్యమనసరగ ల్మూఁడుకాల్లన్
గనద్ధాత్రీక్రాంతి న్మభసయుజగద్వంద్వ మొందన్
దనర్పంగాఁ బౌరాణికకథలదాశార్హ వాక్రు
వ్వ నర్హం బై చెన్నార వనిశరభక్రీడసంజ్ఞన్ [3] 223

వ. ఇది చంద్రశ్రీఛాయను బ్రథమచరణమునను విశాలచ్ఛాయను మూఁడుచరణముల
ను నడుచును. 224

---

1 గుదిరింపఁగా (వ్రా. ము) ఛందోభంగము. 2 ఈచరణము రెండవచరణము వలె లేదు. అన్ని ప్రతులందును ఇది ఇట్లేఉన్నది. 3 ఇందు నాలుగు చరణములును చంద్రశ్రీఛాయనే ఉన్నవి. రెండవచరణము గనద్ధామక్రాంతిన్మభనయుజగద్వంద్వ మొందన్ (వ్రా. ము).

### శ్రీరమణము.

ఆది భమసంల త్రిన నాల్గై, గాదిలి భాభగగంబులు మూఁటన్
బాదుకొనం గవిపట్టి వచోవ్యక్తిం దయితా ధర శ్రీరమణం బౌ. 225

వ. ఇది రుక్మవతీచ్ఛాయను దొలిచరణమును దోదకచ్ఛాయను మూఁడుచరణములును న
డుచును. 226

### రథగమనమనోహరము.

గ్రథితనజగరజ్ఞగంబులం బొసంగం, బ్రథమయతి యుచతుర్థపాదముల్ భావింపన్
విధిదళయుతము లొందింపంగా నజార్యల్, రథగమనమనోహరం బగున్ ధరిత్రిన్.

ఇది పరస్థానవిషమవృత్తవిశేషం బింక సర్వపరస్థానవిషమవృత్తవిశేషం బెట్టి దనిన:—

### సర్వపరస్థానవిషమవృత్తవిశేషము.

క. ఉర్విని నాలుగుపదములఁ, బర్వినగణములను వర్ణపఙ్క్తిగణనయున్
సర్వము విపరీతం బగు, సర్వపరస్థానవిషమసంజ్ఞలను హరీ. 228

### వీణారచనము.

నాలిఁ దయసాగ మ్మతితజ్ఞభగాలు, న్వారించి తజ న్భసలు భభాజనగంబుల్
జేర న్మణిదిగ్దశశిశేఖరవళి వీణారచన ధరఁ జెలఁగును నారదవినుతా. 229

### [1]ఉద్ధతము.

ఆదరార నుద్ధత మయ్యె, న్నరి సజయులున్ నసజ్గలున్
జాదభనజగలు పజ్సలున్, ధర షణ్మహీధ్రగజ ధాత్రియతిన్. 230

### మధుర.

వసమధురాఖ్యము విన్నజారగల్ నా
రసలగములు మీద రాగనమ్యయల్
నసజజగ లొందన్ దంతిరత్నజది
క్ప్రసరవిరమంబు జెందిరసందనరారజా! 231

వ. ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమునను అపరాజితచ్ఛాయను రెండవచరణము
నను మాలినీఛాయను మూఁడవచరణమునను నడుచును. నాలవచరణముకవికల్పితము.

### మణిదీపిక.

గురుపితామహముఖ్యులఁ గినిసి ఘోరరణములోఁ
దెరలిచె నరుఁ డని పలుక రత్నదీపిక ల్దనరును న

1 ఉద్గతము (వ్రా. ము). 2 ఛందోదర్పణమున నరగణము యగణమై యుండవలెను.

త్సరనభభ్నభస ల్నానసజ॥కారభసలు నభర్సనసనసలు
న్భరసజాగలు భూపతు ల్వినభానువిశ్రమయుక్తితోన్. 233

ఉ. ఈసమవృత్తరాజి నుద॥యించువిరామములు న్గణంబులుం
బ్రాపము లెల్లఁ దప్పక న॥మర్చి వచించిన నైదుత్రోవ లై
భాసిలు వృత్తపద్యము ల॥పారము లై విషమాహ్వయంబు లై
వానికి నెక్కు శిష్టజన॥పాలన దుష్టనిశాటచాలనా. 234

ఇది పంచవిధవృత్తవివేకం బింక వైతాలీయజాతివృత్తంబు లెఱింగించెద:—

మ. ప్రకటించు న్ధర దక్షిణాంతికయు నా॥పచ్ఛాందసంబుం బ్రవ
ర్తక యాపాతలికాపరాంతికలు వై॥తాలీయము న్జారుహా
సిక ప్రాచ్యంబు నుదీచ్యవృత్తి యనఁగాఁ॥ జెన్నారువృత్తంబు లిం
దుకులశ్రేష్ఠ యనేకము ల్గలుగు నం॥దుం గొన్ని వాక్రుచ్చెదన్. 235

క. ఖ్యాతిగను రథదలందును, వైతాలీయాఖ్యవృత్త॥వారములందున్
బీతాంబరగురువునకు, నీతిగఁ గృతుల న్లఘువులు ॥ రెండేసి యగున్. 236

## దక్షిణాంతిక.

ఉరుసాజగ ॥ లుండు జేసులన్, సరులం దూకొను ॥ సభ్రవంబులున్
దొర లేడిటఁ ॥ దొమ్మిదింట రా, ధరలోఁ జెన్నగు॥దక్షిణాంతికల్. 237

## ఔపచ్ఛాందసము.

ఇమిడి సలము॥లేడు తొమ్మిదింటన్, సమకూఱు న్యతి॥పడ్ల రేఫయుంబుల్
సమత న్వసుల॥సహ రేఫయుంబుల్, క్షమలో నౌప॥చ్ఛాందసంబు మించున్. 238

## ప్రవర్తక (వర్తక).

స్థిర జేసి ను॥దీచ్యవృత్తియున్, బరఁగు న్సర్గను ॥ ప్రాచ్యవృత్తియున్
గిరిమణియతి॥కీలితంబుగన్, బరముఁ గొల్వఁ బ్ర॥వర్తకాఖ్య మా. 239

## ఆపాతలిక.

లము లాఱు వలున్భగగంబుల్, లమ లెనిమిదిటికడన్భగగంబుల్
క్షమ గిరినవ॥క్రాంతులుం దగున్, బ్రమథితముర యా॥పాతలికాఖ్యల్. 240

## పరాంతిక.

ఇలవర్తక॥వృత్తరీతితోఁ, దుల య్యె పాదచ॥తుష్టయంబులన్
బలసినయది ॥ పద్మనాభ చెన్నలరుం గృతులఁ బ॥రాంతికాఖ్య చే. 241

### వైతాలీయము.

ఋతులఘువులు ♦ రేఫవంబులుఁగా, ధృతవనులఘువులు ♦ రేఫవంబులుఁగా
జత సమకొన ♦ సారసాక్షి పా, లితశుక వైతా♦లీయవృత్తమా. 242

### చారుహాసిక.

[1]ప్రమదమునను ♦ వర్తకాఖ్యవృ, త్తముచందంబున ♦ ధాత్రి సత్కవుల్
సమతూర్చిన♦శార్ఙ్గకార్ముకా, సుమత స్మిఱును ♦ చారుహాసికల్. 243

### ప్రాచ్యవృత్తి.

తొలి నేడిటఁ ♦ దొమ్మిదింట క్రాం, తులు పదునాలుగు♦దూఱు బేసులం
దులఁ బదాఱు♦తొంగలించు స్వర్గలలి న్మాధవ♦ప్రాచ్యవృత్తి యా. 244

### ఉదీచ్యవృత్తి.

తమ కిర వగు♦దక్షిణాంతికా,ఖ్యము తేజంబున ♦ నందగించు మే
లిమికృతులఁ గ♦డిందివేలుపా,తిమురు ధాత్రి ను♦దీచ్యవృత్తికల్. 245

ఇది వైతాలీయజాతివృత్తవివేకం బింక మాలికావృత్తవివేకంబు లెఱింగించెద:—

### మాలికావృత్తవివేకము.

తే. మాలికావృత్తము లనంగ ♦ మఱియు నైదు
దనరు నిరువదియాఱు ఛం♦దముల మించి
యుల లయగ్రాహి లయవిభా♦తి లయహారి
గదసహాఱత్రిభంగియు దండ♦కంబు లనఁగ. 246

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదియక్కరములపద♦మూలయంఘ్రులు నా
ల్గొప్పయతిప్రాసంబులు, గుప్పఁ లయగ్రాహి యనఁగఁ ♦ గొమ రొందు హరీ. 247

### లయగ్రాహి.

ఇం బడరఁగా భజస♦నంబులతుద న్భజస♦నంబులపదంపడి భ♦యంబులు లయగ్రా
హింబరఁగుప్రాసవిర♦మంబునలుమాఱుగుదు♦రంబటుకవీశులుఁ తి♦రంబుగ వచింపన్
నంబరముగా వలని♦తొంబగలి దానవక♦దంబము సహాయముగఁ♦బంబి త్రిదశుల్దు
గ్ధాంబునిధి ద్రచ్చి యమృ♦తంబు గొనఁజాలుసమ♦యంబు దొరకించితి ము♦దంబున
ముకుందా. 248

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదినాల్గరములపద♦ముతదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయవిభాతి యనఁగఁ ♦ గొమ రొందు హరీ. 249

---

1 ప్రథమ (పూ. ము.) ప్రాసభంగము.

### లయవిభాతి.

పెనిమిటులు భార్యలును ♦ దనయులను గాంచిరటె ♦ మనమలర దొడ్డతప ♦ మునవనలదశ
స్యం, దనుఁడు సుతుఁ గోసలియుఁ ♦ దనకడుపులోపల భు ♦ వనము లఖిలంబు నిడు ♦ కొనిన
కొడుకున్రా, మున నినసనద్వయము ♦ వెనుకనసగంబులును ♦ జొనిపియతులుండు నెడ ♦ లవ
లుమలు ప్రాసంబు నిలిపి కవీశ్వరులు ♦ మును లయవిభాతి నిటు ♦ నినువినుతి సేయుదురు ♦
వనజదళనేత్రా. 250

క. ముప్పదితొమ్మిదిమాత్రలు, ముప్పదియేడర్ణముపద ♦ ములదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్పిన లయహారి యనఁగఁ ♦ గొమరొందు హరీ. 251

### లయహారి.

నగణములుపదునొకడు ♦ సగణమును గురువునిడి ♦ మిగులనలుకఱయతులు ♦ దగులులయ
హారిన్, బెగడిశతధృతిపరిప ♦ రిగతుల మెఱయిడినమ ♦ రిగిర్ఘుపతనువుఁ బొడివి ♦ నిగిడి
చనియుంతన్, నిగమములు గొనివెసను ♦ జగము లద్రువఁ బఱచి యు ♦ డిగికడపలిజడధి
ము ♦ నిగినవభయాతిన్, బెగడుచునొడిసికరచి ♦ తెగఁగొనినతురగగళుఁ ♦ డగుహరివనఁగ
ముకవు ♦ లగణుతిచెలంగున్. 252

క. ఇది నేత్రాంబుధిలము ముప్పదినాలుగువర్ణములను ♦ బాదం బగుఁ ద
త్పదచాతుర్థికములచే, నొదవుఁ ద్రిభంగి యనువృత్త ♦ ముర్వరలోనన్. 253

### త్రిభంగివృత్తము.

వినుమక[1]సుకవులు ♦ రసఁబ్రతిపదమున ♦ హసగగముఁడొకతీరై మఱివేరై యమ్ముఁడొక
తీరై, రసనగణములును ♦ సభసగములును ♦ పొసఁగినపద్యతిసంగ్రహణిలింగిం జెల్లుఁ ద్రి
భంగిన్, మసలెదుర్వ్రజమున ♦ దుసికిలి మధురకుఁ ♦ గసికిసమృద్ధశుభాంగిం దగుభంగిం
జేరి త్రిభంగిన్, వెసమనిచినవ ♦ బిసరుహనయనయ ♦ ని సభలవేడ్కగురింతున్ విను
తింతున్ నిచ్చలుఁ గాంతున్. 254

క. ఇదినియమము లేనిమహా, పథమునఁ గావలసినంత ♦ [2]వక్కాణింపన్
గొదలేక నమరు దండక, ముదధీంద్రశయాన తావ ♦ కోత్తమనుతులన్. 255

### దండకము.

విద్వాంసు లెల్లన్ హకారంబె కాని నకారంబె కాని సకారంబె కాని వచిం
పం దగున్నందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁది
వెల్లం దకారంబులే మెండుగా నిచ్చకు న్వచ్చునందాఁక నిర్మించి గుర్వంతముం జేసిన
న్దండకం బంద్రుభక్తానుయాయీ భుజంగేంద్రశాయీ పయస్తక్రదధ్యాదికస్తేయి

1 సుపలురస (పూ. ము). ఛందోభంగము. 2 వఖ్యాణింపన్ (ప); వఖ్యా
ణింపన్ (ఓ).

